# శబ్దయోగభూమిక



ఆచార్య హెచ్. ఎస్. బ్రహ్మానంద

ఆంధ్రభారతి

శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం

(తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆర్థిక సహాయంతో
ముద్రింపబడిన గ్రంథం)

అక్షర ప్రచార ప్రచురణ

అనంతపురం.

# శబ్దయోగభూమిక

ఆచార్య హెచ్. ఎస్. బ్రహ్మానంద
ఆంధ్రభారతి
శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం

అక్షర పరిచార ప్రచురణ
అనంతపురం.

ప్రథమ ముద్రణ
సెప్టెంబరు 1994

ప్రతులు 1000



ప్రతులకు :

శ్రీమతి హెచ్. నిర్మల
28-493-A7 విజయనగరకాలనీ
బెంగుళూరురోడ్డు
అనంతపురం 515 001 ఆ. ప్ర.

వెల : 30 రూపాయలు

ముద్రణ : వెరైటీ ప్రింటర్సు
చల్లబజారు, ఏలూరు, ప.గో॥జిల్లా.

# విషయసూచిక



—(ం)—

# కృతజ్ఞతలు

ఈ గ్రంథం వెనుక నేను "వ్యంజనసూత్రం" కోసం పరిశోధన చేస్తున్న రోజుల్లో జరిగిన ఒక అద్భుతమైన సంఘటన నేపథ్యంగా ఉంది. దాన్ని చెప్పకోవటం చాలా అవసరంగా భావిస్తున్నాను.

1978 లో పాదయాత్రచేస్తూ కంచి పీఠాధిపతి శ్రీ చంద్రశేఖర సరస్వతీస్వామివారు చిన్నతిప్ప సముద్రమనే ఊళ్ళో (కాయల్‌పాడు సమీపంలో) ఉన్నరోజది. నేను మామామగారైన కీ.శే. సీతారామయ్య గారిని పరామర్శించడానికి వెళ్ళాను. వారు స్వామి పాదాలపై పడమని నన్ను ముందుకుతోశారు అప్పటికి నేను రాసి ఉంచుకున్న "వ్యంజన సూత్రం" తాలూకు నోట్సును వారిపాదాలపై పెట్టాను. కొన్ని పుటలు తిరగవేసి "బ్రహ్మసూత్రం" మాదిరిగా "వ్యంజన సూత్రమా!" అని నవ్వుతూ ఆశీర్వదించారు.

ఆ రోజులలో నాకు వ్యంజన సిద్ధాంతం వెనుక స్ఫోట దానివెనుక వైదిక శబ్ద మీమాంస ఎలా ఉందో ఏమీతెలియదు. పెద్దల మాటలను అనువదించటమే నేను చేసినపని. వారి ఆశీర్వాదంలో అంత బలమున్దనికూడా తెలియని బాల్యమది. ఇటీవల వారు పరమపదించిన సందర్భంలో మళ్ళీ వారి పార్థివ శరీరాన్ని "దూరదర్శనం" చేస్తున్నపుడు ఒక కదలిక కలిగి ఈ గ్రంథం తయారయింది. అందుకే ఈ గ్రంథం వారి పాదపద్మాలకు సమర్పించాలన్న సంకల్పం కల్గింది. ఆ మహా యోగికి సహస్రాధిక నమస్కారాలు.

నాకు ధ్వనిసిద్ధాంతాన్ని పరిచయంచేసి శబ్దం ఏమిటి? అని వాక్ తత్త్వ మీమాంసలోకి నన్ను పరోక్షంగా నెట్టిన మా ఆచార్యులుపూజ్యులు శ్రీ తుమ్మపూడి కోటేశ్వరరావు గారికి హృదయపూర్వక ధన్యవాదాలు. వారు రచించిన "కుమారభారతి" కావ్యం మీద నా విద్యార్థి డా.ఆదవాని హనుమంతప్ప విమర్శ గ్రంథంగా 'కుమారభారతి దర్శనం"రచించాడు

ఆ గ్రంథానికి పీఠికగా "కుమారవిద్య"ను రచిస్తున్నప్పుడు, కుమ
గాథలోని వాద్యోగరహస్యం అవగతమైంది. ఆ పీఠికే కొన్ని మార్పుల
ఇక్కడ అనుబంధంలో నాల్గవ వ్యాసమయింది. చి॥ హనుమంతప్ప
శుభాకాంక్షలు.

ఈ గ్రంథంకోసం కొన్ని వందల సంస్కృత, ఆంధ్ర, ఆం
గ్రంథాలను శోధించాల్సి వచ్చింది. ఆయా గ్రంథ రచయితల
ప్రాక్ పశ్చిమదేశాల వారికి నా కృతజ్ఞతా పూర్వకమైన వందనాల

చాలా శ్లోకాల, మంత్రాల అర్థాలను గ్రహించడంలో సహకరించి
నన్ను ఆశీర్వదించి, 'ముందుమాట' రాసిచ్చి, ప్రోత్సహించిన స
శాఖలోని సంస్కృత భాషాధ్యాపకులు, ఉత్తమ దేశికులు ఆచార
శలాక రఘునాథశర్మ గారికి నమస్సులు.

నా సాహిత్యశాస్త్ర వ్యవసాయంలో మార్గదర్శకులైన ఆచార్యు
జి యస్. రెడ్డి, భద్రిరాజు కృష్ణమూర్తి, బిరుదురాజు రామరాజ
కొత్తపల్లి వీరభద్రరావు, పి. యస్. ఆర్. అప్పారావు, నాయని కృ
కుమారి గార్లకు శిరసువంచి నమస్కరిస్తున్నాను.

అనుబంధాలలో ఇచ్చిన మొదటి మూడు వ్యాసాలను "భారతి
లోనూ ఆంధ్రపత్రిక ఉగాది సంచికలోను ముద్రించి ప్రోత్సహించి
పూజ్యులు శ్రీ శివలెంక రాధాకృష్ణగారికి, ఈ గ్రంథానికి ధనసహాయ
చేసి వెలుగులోకి రావటానికి కారకులు తి.తి.దే. అధ్యక్షులు శ్రీవి.చెంగ
రెడ్డిగారికి, వారి సహచరులకు, అధికారవర్గానికి ధన్యవాదాల
శ్రీ జానుమద్ది హనుమత్‌శాస్త్రిగారికి కృతజ్ఞతా పూర్వక నమస్సులు.

ప్రతి సంవత్సరం ఏదోఒక గ్రంథంరాయాలని నాచేత రాయిం
వ్రతం నిర్వహిస్తున్న నా శ్రీమతి అవధానం నిర్మలకు, నన్ను సద
ప్రోత్సహించే ఆంధ్రభారతి అధ్యాపక వర్గానికి, నాతో సహకరించే న
చిరంజీవులకు, నా శుభాభివందనాలు.

శ్రీరామనవమి 1994 — రచయిత

# ఉపోద్ఘాతము

భారతీయులు శబ్దాన్ని పరబ్రహ్మ దర్శనానికి సాధనంగా భావించారు. ఒకటి తెలుసుకుంటే మరొకటి సులభంగా తెలుస్తుందని సిద్ధాంతీకరించారు.

ద్వే బ్రహ్మణీ వేదితవ్యే శబ్ద బ్రహ్మపరంచ యత్
శబ్ద బ్రహ్మణి నిష్ణాతః పరంబ్రహ్మాధి గచ్ఛతి

[మైత్రేయాణీ ఉపనిషత్తు 6-22]

అని ఉపనిషత్తు ప్రతిపాదించింది. బ్రహ్మతత్త్వ దర్శనంలో తెలుసుకోదగ్గ ముఖాలు రెండున్నాయి. ఒకటి శబ్దబ్రహ్మ, మరొకటి పరంబ్రహ్మ. ఎవరు శబ్దబ్రహ్మలో నిష్ణాతులవుతారో వారు పరంబ్రహ్మను పొందగలుగుతారని పైమంత్రానికి అర్థం.

భారతీయ వాగ్దర్శనం లౌకికాలౌకిక సమన్వయ సూత్రరూపమైంది. ప్రపంచంలో ఏ ఇతర దేశాల్లోనూ ఇంతగాఢంగా ప్రయోజనవంతంగా శబ్ద తత్త్వ విచారణ జరగలేదు. అంతేకాదు, భాషలో వ్యాకరణంఅంటే, కేవలం వర్ణపద వాక్య విశ్లేషణ అని భారతీయులు భావించలేదు. శబ్దోత్పత్తి అంటే స్థానకరణప్రయత్నజన్యమైన కేవలభౌతిక ప్రక్రియగా వివరించలేదు. ప్రాణశక్తి పొందేస్ఫోటనంగా శబ్దాన్నిదర్శించారు. కనుక స్ఫోటనం పొందినశబ్దం మనంవినేది మాట్లాడేది కాగా వినని దశలో మాట్లాడని దశలో అస్ఫుటితంగా ఉన్న శబ్ద పూర్వ సమాధి దశను చేరుకోవడానికి శబ్దాన్ని అంతర్ముఖంగాచేసి సాధించాలనీ దీన్ని 'శబ్దసాధన' మని 'శబ్దయోగ' మని అంటారని ప్రబోధించిన మహర్షులు భారత దేశంలో అనాదినుంచీ ఉన్నారు. ఈ శబ్ద యోగానికి భూమికగా ఉన్నవైదిక వాగ్ దర్శన క్రమాన్ని వివరించడమే ఈ గ్రంథ ప్రయోజనం.

—రచయిత

అధ్యాయం 1

# సప్తమాతృకలు

వాక్కును బోధించే శబ్దాలు ఇంకా ఆరున్నాయి. మొత్తం ఏడు శబ్దాలున్నాయి. ఇవి సప్తపదాలు. వీటికి సప్తపదార్థాలున్నాయి. ఇక్కడ పద మంటే పదానికున్న అర్థమని, లోకంలో జ్ఞానం అనబడేది పదానికున్న అర్థాన్ని తెలుసుకోవడానికి సంబంధించిందే. కనుక సప్తమాతృకలు చెప్పబడే ఈ శబ్దమాతృకలు ఎవరో చూద్దాం.

'బ్రాహ్మీ తు భారతీ భాషా గీర్వాగ్వాణీ సరస్వతీ'

అని అమరసింహుడు ఈ తల్లులను వరుసగా ఒక చోట నిదర్శించమంటున్నాడు.

1. బ్రాహ్మి 2. భారతి 3. భాష 4. గీః 5. వాక్ 6. వాణి 7. సరస్వతి. నిఘంటువు ప్రకారం ఈ శబ్దాలు పర్యా శబ్దాలు కావచ్చుకాని వీటి అర్థశక్తులు మాత్రం భిన్నంగ కనిపిస్తాయి ఈ ఏడు మాతృకల మూలపుటమ్మ ఎవరు? ఏ అంతరార్థాన్ని ఈ ఏ పేర్లతో పిలిచారు? ఇంతకీ ఎవరు పిలిచారు?

అలా పిలిచిన వారినే భారతీయులు అన్నాం. వీరికి ప్రవ మహర్షి. వారు దర్శించిన సత్యం పేరు వేదం. ఇది సాధనము, సాధ్యమ కూడా అయింది ఈ మహర్షి ప్రాజ్ఞుడు, ధీరుడు, అమృతుడు, మనీః తపోరూపమైన యోగం వారి జీవనం. సత్యదర్శనం వారి ధర్మం. ధర సాధనం వారి కర్మ.

వారు జగత్తును ఒక సృష్టిగా భావించారు. సృష్టి అనగానే మా పితరులు ఉండాలి. ఆ మాతను 'వాక్కు' అని, ఆ తండ్రిని 'వాక్పతి' అని వారు పిలిచారు.

“నమో వాచే నమో వాచస్పతయే”

[ తైత్తిరీయ ఆరణ్యకం 1-30:3

అని ఈ దంపతులకు మహర్షి నమస్కరించాడు. వారిని బ్రహ్మ-సరస్వతి అని పురాణాలలో కథలుగా చెప్పారు. బ్రహ్మ చేతిలో 'వేదాలు', సరస్వతి చేతిలో 'వీణ', - ఉంటాయన్న పౌరాణిక భావనకు ఈ వైదికమైన దాంపత్య భావనే కారణం. బ్రహ్మ 'జ్ఞాన' స్వరూపుడు అందుకే చతుర్ముఖంగా ఉంటాడు. జ్ఞానాన్ని ఎటువైపు పరిశీలించినా ఒకటిగానే భాసిస్తుందని అర్థం. సరస్వతి 'శబ్ద' స్వరూపం. ఆమె శబ్దిస్తూ ఉంటుంది. అది నిరంతర 'నాద' రూపం అందుకే ఆమెను 'వాణి' అని, ఆమె చేతిలోని సాధనాన్ని 'వీణ' అని అన్నారు.

ఈ దంపతులను వాక్కు-వాక్పతి అని వైదికమహర్షులు పిలిచింది వాక్కుద్వారా ఆ వాక్పతిని అందుకోవడాన్నే 'శబ్దయోగ'మని మహర్షులు పిలిచారు.

ఆ 'వాక్కు' సప్తధా ప్రకాశిస్తోంది. ఆ ప్రకాశాన్ని వ్యక్తీకృతి అంటాం. వ్యక్తం అంటే తెలియబడిందని అర్థం. వ్యక్తమయిన ఆ వాక్కును మరి ఆరు పేర్లతో కూడా పిలవ వచ్చు. అందుకే "వ్యక్తాయాం వాచి" అని నిఘంటువు వివరించింది. - అంటే వ్యక్తమయిన వాక్కు అనే అర్థంలో ఈ ఏడు పేర్లూ ఉన్నాయని తాత్పర్యం. అంటే బ్రాహ్మ్యాది సప్త శబ్దాలు ఉచ్చరింపబడగా వినబడుతున్నవని అర్థం.

ఇక ఉచ్చరింపబడని దశలో ఈ 'వాక్కు' ఎలా ఉంటుంది? చతుర్ముఖమైన ఆ బ్రహ్మతత్త్వంతో ఒకముఖమే బ్రాహ్మ్యాది శబ్దాల రూపాన బయటపడింది. తక్కిన మూడు ముఖాలను కూడా వేదం గుర్తించి ఆ మూడు ఒక 'గుహ' లో బంధింపబడి ఉన్నాయని; ఒక 'బ్రహ్మణ్యుడు' మాత్రమే ఆ మూడింని అందుకో గలుగుతాడని, ఈ ఒక నాల్గో ముఖాన్ని మాత్రమే మనం చూడగలుగు తున్నామని చెబుతోంది వేదమంత్రమిది.

చత్వారి వాక్ పరిమితా పదాని తాని విదుర్బ్రాహ్మణాయే మనీషిణః
గుహాత్రీణి నిహితా నేజ్గయంతి తురీయం వాచో మనుష్యావదంతి
(ఋగ్వేదం 1-164-45)

(వాక్కు నాలుగు విధాలుగా ఉంది. పర - పశ్యంతి. మధ్యమ. వైఖరి అని నాలుగుపదాలు దాని నాలుగు దశలు. ఈనాలుగుదశలున్నా

యని బ్రహ్మణ్యుడైన మనీషి మాత్రమే గుర్తించగలుగుతాడు. ఏ
కంటే మొదటిమూడూ గుహలో ఉన్నాయి-అవి బయటికిరావు నాల్గవవ
మాత్రమే మనుష్యులు మాట్లాడే "వాక్కు" రూపంలో-అంటే
రూపంలో బయట పడుతోంది)

సప్తమాతృకల్ని వివరించడానికి మునుపు వేదశబ్ద స్వర
ఎలాంటిదో పరిచయంచేయటం అవసరం. వేదశబ్దాలు ప్రతీకలు.
ప్రత్యామార్గంలో కాకుండా పరోక్షమార్గంలో తత్త్వదర్శనం చేయిస్తా
అర్థం. ప్రత్యక్షమార్గ శబ్దాలే అయితే ఇలా మూడుగుహలో దాగిఉన్నా
నాల్గవది బయట ఉందంటూ చెప్పరు. ఈమూడు-ఒకటి అన్న సంఖ్య
లోకంలోవాడుతు అర్థాలలో వాడుతున్నామా ! అసలు మంత్ర
వీటికి ఏఅర్థాలను నిక్షేపించి వాడాడు. వాటిని గుర్తించటం ఎలా
అన్నది వైదికశబ్ద మీమాంసలో చాలా గడ్డప్రశ్న.

ఈ వైదిక శబ్ద తత్త్వం తెలిస్తేనే పురాణ కావ్య వాఙ్మయం
మవుతుంది. అలంకార సిద్ధాంతాల నేపథ్యం తెలుస్తుంది. శాస్త్రవాఙ్మ
పునాదులు అవగాహనకు వస్తాయి. మొత్తం భారతీయ సాహిత్యమ
వైదిక శబ్దార్థ తత్త్వదర్శనాన్ని పునాదిగా కల్గింది. అందుకే ఈ
చాలా అవసరం అవుతోంది.

వేదభాషకు అర్థనిర్ణయం లౌకిక శబ్ద నిఘంటువు ద్వారా సా
కాదు. అది కేవలం దర్శన సాధ్యం. అంటే గురువు ద్వారా శిష
సాధన మార్గంలో అవగాహనకు వచ్చే సాంప్రదాయికార్థమే ఉంట
తప్పాదానికి లోకవ్యవహారంలోని అర్థం ఉండదని అర్థం. అందుచేత వై
శబ్దార్థం కేవలం దార్శనిక సత్యం శాస్త్ర ప్రమాణాలచేత కొలవదగ
(అనుమీయమానం) కాదు. యోగ భాష అని, సంధ్యా భాష
పేర్లతో కూడా వేద భాషనుపిలిచారు మనోవాగ్ దశల సమన్వయ
పడుతుంది కాబట్టి అది 'యోగ' భాష. దాని అర్థం సంధ్యా కాంతి
రాత్రింబవళ్ళను కలపగలుగుతుంది కాబట్టి-పద, పదార్థాల అద్వైతా
దర్శింప చేస్తుంది కాబట్టి సంధ్యాభాష. ఈ దృష్టితో వాక్కు-వాక్ప
తత్త్వాన్ని మనం వివరించాలి కాని దీనికి మరోమార్గంలేదు.

అమరకోశ వ్యాఖ్యాత పూజ్యులు శక్తిధర శాస్త్రిగారు బ్రాహ్మ్యాది శబ్దాలకు అర్థ వివరణ రాశారు. తొలుత ఆ వివరణకు అర్థం.

I. బ్రహ్మ ఇయం-బ్రాహ్మీ (ఇది బ్రహ్మమే కాబట్టి బ్రాహ్మి)
II. భరతస్యేయం-భారతీ (ఇది భరతమే-కనుక భారతీ )
III. భాష్యత ఇతి-భాషా (ఇది మాట్లాడబడుతోంది-అందుచేత భాష)
IV. గృణంతి-గృణంత్యేతామితి గీ:(వ్యక్తం చేయబడుతోంది-)
IV (b) భాగురిమతే శిరాపి- గీః (గిరా-రూపాంతర మని భాసురి)
V. ఉచ్యతే వచనం వేతి -వాక్ (పలుకబడేది.)
VI. వణయతి ఇతి-వాణీ (— ఉచ్చరింపబడుతోంది కాబట్టి)
వాణీ వా వణతి వేద ముచ్చారయతీతి }
వణో బ్రహ్మ తస్యేయం వాణీ తివా }
VII. సరోఽస్త్యస్యా ఇతి-సరస్వతీ
సరతీతి సరో జ్ఞానమస్త్యస్యేతి సరస్వా
ద్బ్రహ్మ తస్యేయం శక్తిరితి వేతిస ప్తవచనాధి షాత్రి దేవతాయాః

బ్రహ్మజ్ఞాన శక్తిరూపమైనది సరస్వతి. ఆమె అధిష్ఠాన దేవత. ఆమెకు ఈ సప్త వచనాలున్నాయి-అనిశాస్త్రిగారి వ్యాఖ్యానానికి అర్థం

ఈ పర్యాయ శబ్దాలతోపాటు కొన్ని క్రియా రూపాలుకూడా మాట్లాడటం అనే అర్థాన్ని సూచిస్తాయంటూ అమరకోశం కింది విధంగా చెప్పింది.

'వ్యాహార ఉక్తిర్లపితం భాషితం వచనం వచః'

8. వ్యాహరణం-వ్యవహారః (వ్యవహారం)
9. వచన మిత్యుక్తిః (ఉక్తి)
10. లపన మితిలపనమ్ (ఆలాపనం)
11. భాషణమితి భాషితం (మాట్లాడ బడింది)
12 ఉచ్యత ఇతి వచనమ్ (పలుకబడింది)
13. వక్తీకి వచః (చెబుతుంది కాబట్టి)

'ఇతిషడ్ భాషణస్య-కేచిద్ బ్రాహ్మ్యాద్యాత్రయో దశవచన పర్యాయ
ఇతి బ్రువంతి' అని శక్తిధరుల వ్యాఖ్యానం (పు. 47)-

మాట్లాడటమనే అర్థంలో ఉన్న ఈ ఆరు క్రియలు-సరః
వాచకాలైన బ్రాహ్మ్యాది శబ్దాలు అన్నీ కలిసి (7 + 6 = 13) పర్యా
వాచకాలే అని అర్థమన్న మాట. ఇంత వివరించినా వైదిక మంత్రా
పధ్యంతో ఈ 'వాక్'తత్త్వ విశ్లేషణ చేసి నిరూపిస్తే తప్ప నిఘం
చెబుతున్నది అర్థంకాదు.

'మహో అర్ణః సరస్వతీ ప్రచేతయతి
కేతునాధియో విశ్వా విరాజతి' (ఋగ్వేదం 1-3-2)

అన్న ఋగ్వేద మంత్రంలో సరస్వతీ ఏంచేస్తుందో మహ
దర్శించారు. సరస్వతి మన చైతన్యంలోనికి ఒక మహా ప్రవాహం
ప్రవేశిస్తుంది. అదిఒక మహాకదలిక. సత్యస్పృహను కలిగిస్తుంది.
ద్వారా మనలోని ఆలోచనలు వెలుగుతాయి. కనుక సరస్వతీ స్ఫు
రూపిణి ప్రతిభాశక్తి.

పూజ్యులు శ్రీ అరవిందులు తమ 'వేదరహస్య' మనే గ్రంథ
పై మంత్రానికి అర్థం చెబుతూ ఈ సంప్రదాయార్థాన్నే ప్రతిపాది
ఉన్నారు.

"Saraswati brings into active Cousciousnes in the hun
being the great flood or great movement, the truth consciou
itself and illumines with it all our thoughts." అని అరవిందభాష
యాస్కాచార్యుడు చెప్పిన అర్థానికి ఇది ఆధునిక వ్యాఖ్యానం మాత్ర

"సరస్వతీ ప్రజ్ఞాపయతి-ప్రచేతయతి; కేతునా కర్మణా ప్రజ్ఞయ
ఇమానిచ సర్వాణి ప్రజ్ఞానాన్యభిద్విరాజతి-వాగర్థేషు విధీయతే తస్మా
ధ్యమికాం వాచం మన్యంతే"

అని వివరించారు యాస్కాచార్యులు. యాస్కుడే తొలిసారిగ వైదిక లౌకిక శబ్దాల అర్థనిర్ణయ ప్రమాణాలను గురించి ఆలోచించిన వాడు. వారు సరస్వతిని ప్రచేతన శక్తిగా వ్యాఖ్యానించారు. ప్రజ్ఞాన దాత్రిగా గుర్తించారు ప్రజ్ఞచేత ఇచ్ఛాజ్ఞాన క్రియారూపాలు ప్రకాశిస్తున్నాయి. కేతు....ఇచ్ఛారూప సంకేత కర్మ-క్రియా రూపం ప్రజ్ఞానం-జ్ఞానప్రభేదం ఈ మూడురూపాలకు 'వాహిక వాక్కు' అందుకే వాక్కును ,మాధ్యమికం అన్నారు. ఈ వాక్కు శబ్దార్థాల రూపంలో వ్యక్త మవుతుంది. జ్ఞానక్రియారూపాలకు లంకెగా ఇచ్ఛారూపమైన సరస్వతి ఉంటుందన్నమాట జ్ఞానరూపంఅర్థం. క్రియారూపం శబ్దం. ఈ రెంటిని సరస్-ప్రవాహ రూపంలో కలిపే శక్తి కల్గింది. కాబట్టి వాక్కు 'సరస్వతి' అయింది. అందుచేత 'బ్రహ్మ' సత్యస్వ్రహకు సంకేతం సత్యలోకనివాసి. అనటంలోనూ ఈ తాత్త్వికార్థమే ఉంది. ప్రపంచసృష్టి చేస్తాడన టంలోనూ ఈఅర్థానికివ్యక్తీకరణం ఉంది. బ్రహ్మకూతురేసరస్వతి అనటా నికి నిరూపణఉంది. బ్రహ్మ నోటసరస్వతి కాపురం ఉంటుందన్నా ఇదే అర్థముంది. ఆ బ్రహ్మకు వ్యక్తీకృతే ఈ సరస్వతి. ఈ సరస్వతి చేత మనచైతన్యంలో సత్యస్వ్రహకలుగుతోంది. దాన్నే 'బ్రహ్మ'మన్నారు.

ఈ మహార్థాన్ని నిరూపించే ప్రతీకాత్మక కథలు-సందర్భ కల్పనలు భావచిత్రాలు-ఉపమలు-రూపకాలు- సంభాషణలు వేద వాఙ్మయంలో అంతటా కనిపిస్తాయి. వాటినంతా ఒకక్రమంలో అమర్చుకొని చూస్తేనే బ్రాహ్మాది శబ్దాలకు ఋషులు భావించిన అర్థం అవగతంకాదు. అప్పుడు ఆ అర్థం శబ్దానికి ఉన్న అర్థంలో మాత్రం ఉండదు. అదిఒక అవగాహన రూపంలో ఉంటుంది. ఆ అవగాహనను 'ప్రజ్ఞ' అని వేదంపిలిచింది.

'ప్రజ్ఞానం బ్రహ్మ' అని ఉపనిషత్తు బ్రహ్మను ప్రజ్ఞానరూపంగా కీర్తించింది. ఈ ప్రజ్ఞాతత్త్వం ఏమిటి? ప్రజ్ఞ-అంటే 'తెలివి' అనే లౌకికార్థ భిన్నమైన ఏ అర్థం వైదికమైన ఈ ప్రజ్ఞాశబ్దానికి ఉంది? ఈ రెండు ప్రశ్నలకు సమాధానం తెలుసుకోవాలంటే సరస్వతీ సూక్తాలను తొలుత అధ్యయనం చేయాలి.

అప్పుడే మునుపు ప్రస్తావించిన 'నమోవాచే నమోవాచస్పతయే' అన్న ఉపనిషన్మంత్రానికి అర్థం లభిస్తుంది. ఈ మహార్థలాభం కోసమే పురాణకావ్యవాఙ్మయం భారతదేశంలో పుట్టింది వేదాలు ప్రభుసమ్మితాలని, పురాణాలు మిత్రసమ్మితాలని, కావ్యాలు కాంతాసమ్మితాలని - అయినా అవిచెప్పే మహార్థం ఒక్కటేనని గుర్తించడానికి 'సరస్వతీ' సూక్తా అధ్యయనం చాలా అవసరం.

ఈ 'సరస్వతీ' శక్తి స్వరూపాలనే బ్రాహ్మి, వారాహి, మాహేశ్వ కౌమారి, వైష్ణవి, ఇంద్రాణి, చాముండ అనే సప్త మాతృకలుగా పురా వాఙ్మయం పేర్కొన్నది.

అధ్యాయం 2

# వాగ్దేవీ సూక్తాలు

వాగ్దేవి తన ప్రశంస తానే చేసుకుంటున్న సూక్తాలు సరస్ సూక్తాలు. వీటికి పరమాత్మ దేవత. అంభృణీ ఋషి ద్రష్ట. ఈ ఋషి వాగృషి అని కూడా పేరుంది. ఈ సూక్తాలు ఋగ్వేదంలో (31. 10 కనిపిస్తాయి.

1) *అహం రుద్రేభిర్వసుభిశ్చరామ్యహ మాదిత్యైరుత విశ్వదేవై*
*అహం మిత్రావరుణోభా బిభర్మ్యహ మింద్రాగ్నీ అహమశ్వినో*
**(I walk with the Rudras and the Vasus, with the Adit too, and all the hosts of gods. I bear up the two)**

(నేను రుద్ర, వసు, ఆదిత్యులతో సహచరిస్తున్నాను. మిత్ర వర లను, ఇంద్రాగ్నులను, ఇద్దరు అశ్వినులను భరిస్తున్నా అనగా ప్రసవిస్తున్నాను)

2) *అహం సోమ మాహన సం బిభర్మ్యహం త్వష్టార ముత పూషణం భగ*
*అహం దధామి ద్రవిణం హవిష్మతే సుప్రావ్యే యజమానాయ సున్వ*

[I bear Soma and Surya with their individual ensur
I also give treasure to the sacrificer, and deliver chil
the yagamana, the doer of sacrifice]

(నేను సూర్య చంద్రులను వారి వారి అంతస్సత్త్వాలతో క
భరిస్తున్నాను. హవిస్సులను వేల్చేవారికి ధనంసమకూరుస్తున్నా
యజమానికి శిశువును ప్రసవిస్తున్నాను)

3) అహం రాష్ట్రీ సంగమనీ వసూనాం చికితుషీ ప్రథమా యజ్ఞియానా
తాం మాదేవావ్యదధుః పురుత్రా భూరిస్థాత్రాం భూర్యావేశయం

[I am the dominating one, the gatherer of the treas
who understands, among the beneficiers of homage,
first. The Gods have distributed me in many places
have many abodes, I enter in many (forms)]

(నేను అన్నిటిలోనూ అధిగమించి ప్రకాశిస్తున్నాను. యజ్ఞఫల
సంగ్రహించే వారిలో ప్రథమురాల్ని నేనే సకలసంపదలన్నీ
సంగ్రహిస్తున్నాను. దేవతలు నన్ను చాలాచోట్ల వ్యాపింప
ఉన్నారు. నాకు చాలా నివాసాలున్నాయి. నేను చాలారూప
ప్రవేశిస్తాను)

4) యయాసో అన్నమత్తి యో విపశ్యతి యః ప్రాణితియ ఈశృణోత్యు
అమంతవో మాంత ఉపక్షీయంతి శ్రుధి శ్రుతం శ్రద్ధివంతే వదామి

[Thanks to to me the discerving, one eats food, Use
who breathes, the who hears, what is spoken unknow
they live in me. Listen then who knowest, what I
merits belief]

(నా చేత నియుక్తులై జనులు అన్నం తింటున్నారు. శ్వాస
స్తున్నారు. చెప్పింది వింటున్నారు. తెలీకుండానే వారు నా
ఉంటున్నారు. ఓబుద్ధిమంతుడా! విను. నీలో శ్రద్ధ కలుగుతుం

5) అహమేవ స్వాయమిదంవదామి జుష్టం దేవేభిరుత మానుషేభిః
యంకామయే తముగ్రంకరోమి తం బ్రహ్మాణం తమృషిం తం
సుమేధామ్

[I spoutaneously announce; their which pleases the G
and the humans, whomsoever I love. I make him pow
ful. I make him a Brahma, a seer, a sage]

(ఇది నేనే స్వయంగా చెబుతున్నాను. దేవతలు మానవ
అందరూ దీనిచేత తృప్తులవుతారు. నేను ఎవర్ని వాంఛిస్తే
వాడిని నేను మహోగ్రునిగా చేస్తాను. మహాజ్ఞానవంతుణ్ని చేస్తా
వాడిని ఋషిని చేస్తాను. వాణ్ని మంచి మేధావిని చేస్తాను.)

6) అహం రుద్రాయధనురాతనోమి బ్రహ్మద్విషే శరవేహం తవా ఉ
అహం జనాయ సమదం కృణోమ్యహంద్యావా పృథివీ అవివేశ

[I stretch the bow for Rudra. That the arrow des
the enemy of the saved formula. I create the con
among men. I have perraded the sky and the earth]

(నేను రుద్రునికోసం ధనువును అందిస్తాను. బ్రహ్మద్వేషు
అనగా జ్ఞాన భంజకుల్ని చంపడానికి శివుడు బాణాన్ని ఆ ధనువు
అనుసంధిస్తాడు నేనే మనుష్యులలో స్పర్థను కల్గిస్తున్నాను.
భూమ్యాకాశాలను ఆవహించి ఉన్నాను.)

7) అహం సువే పితరమస్య మూర్ధన్మమ యోనిరప్స్వంతః సము
తతో వి తిష్ఠేభువనాను విశ్వోతామూం ద్యాం వర్ష్మణోపస్పృశామి

[I give birth to the father as the summit of this (wor
My origin is in the waters, in the ocean. Thence I have spr
myself across all beings. And I touch even the sky with
side (of my skule)]

[ఈ సృష్టికి శిఖరాయమాణంగా తండ్రిని కన్నాను. నా పుట్టుక దజలాల్లో. అక్కడినుంచే నేను అన్ని జీవరాసుల్లోనూ వ్యాపించాను రై అంచులతో ఆకాశాన్ని కూడా తాకుతున్నాను.]

*అహమేవ వాత ఇవ ప్రవామ్యారభ మాణా భువనాని విశ్వా*
*పరో దివా పర ఏనా పృథివ్యైతావతీ మహినా సంబభూవ*

( It is again I, who blows like the wind, seizing all the ces, beyond the sky; beyond the earth, below such in ess have I become)

(నేను వాయువులా అంతటా వీస్తున్నాను. ఉన్న ప్రతీదానిని హరి ను. ఆకాశాన్ని, భూమిని అతిక్రమిస్తూ అంతటా స్వమహిమతో న్నాను.)

ఇక్కడ చెప్పబడ్డ 'సరస్వతి' కి సృష్టి, స్థితి, లయాల్లో చాలా న్యముంది. ఈమె దేవతల సహచారిణి. దేవతల్ని ధరిస్తోంద కూడా ష్ణ-అమృతాన్ని-ద్రవిణాన్ని భరిస్తుంది. యజ్ఞఫల సంగ్రహణం ని నానారూపాలలో ఆవేశించిఉంది. ఆమె నియుక్తి లేక ఆహార ములు జరగవు. కడకు మాట్లాడటం-వినటం కూడా ఆమెచేయిస్తున్న ఆమెను ఆరాధన చేసినవాడు శ్రద్ధాళువు అవుతున్నాడు. ఆమె తన అనుగ్రహం ప్రసరిస్తుందో వాడు బలవంతుడు, జ్ఞానవం ఋషి, మేధావి అవుతాడు శివుడికి ధనుపు అందిస్తున్నది ఆమె. వుమీద బాణాన్ని సంధించి శివుడు బ్రహ్మద్వేషులైన రాక్షసుల్ని ాడు. ఆమె కారణంగానే మనుష్యుల్లో స్పర్ధాద్వేషాదిభావాలు పుడు యి ఆమె భూమ్యాకాశాలను ఆవరించి ఉంది. అంతేకాదు ఈ పెద్ద ఎవరో ఆ తండ్రిని ఆమె కన్నది. అలాంటి ఆమె నీటిలో . అక్కడి నుంచి ఆమె అన్ని జీవరాసులలోనూ ప్రవేశించింది. ంకాశం భూనభోంతరాలను తాకుతోంది. ఆమె వాయు రూపంలో వీస్తోంది. ప్రతీదాన్ని ఎలాసృష్టించి నిలుపుతుందో అలానే ఆమె నశింపచేస్తోందికూడా. ఆమె విశ్వవ్యాపినిగా ఉంటూ తనంతట ఆవిర్భవిస్తోంది.

ఈ వర్ణనకు అర్థం ఏమిటంటే ఈ సృష్టిని ఒక మహత్తరమైన శ
నిర్వహిస్తోందని. ఆమె స్వయంభువు. నీరు–ఆ మహాసృష్టికి మూలశ
అవ్యక్తస్థితి. ఆమెలోని స్వప్రకాశ దీధితులే దేవతలు. ప్రపంచం
సర్వశబ్దజాలరూపంలో ఆమె ఆయా వస్తువులలో అనుప్రవేశిస్తున్న
ఆయావస్తువుల ఉనికిని రక్షిస్తోంది. పదార్థ సంగ్రహణం కా
‘అపదం’ తన ఉనికినికోల్పోయి జ్ఞానలేశంగా మిగిలిపోతుంది. (
ఆమె పదార్థ సంహారం చేస్తుందనటానికి అర్థం.

ఇక్కడ ఆమె అందిస్తున్న ‘ధనువు’ -సుశబ్దం దాన్ని ధరిస్తు
రుద్రుడు రోదిస్తున్న జీవుడు. ఆసుశబ్దంలో ప్రయుక్తమైన సంస్కార
జ్ఞానరూపమైన బాణం దానిచేత చస్తున్నవాడే అజ్ఞానరూపమైన రాక్షసు

ఆమె తండ్రిని కంటోంది-అన్నది అతి విచిత్రమైన భావ
శబ్దంచేత అర్థం అనుగతినిపొంది శబ్దాన్ని నియమిస్తుంది. అందుకే
శబ్దానికి ఒక అర్థం నియతమై ఒక దాంపత్యభావాన్ని పొందుతోం
అయినా ఆ అర్థం శబ్దబోధకు అతీతమైందికాదు- అందుకే భాషలో ఆత్మ
పుత్రకామాసి’ అన్నట్టు మగడు-కుమారుడు, మగడు-భర్త అవుతున్నా
ఈ అర్థంలోనే ఆమె తనభర్తను సృష్టించుకుంటోంది. బ్రహ్మ సరస్వ
సృష్టించాడంటే ఏ అర్థముందో, శక్తి శివున్ని సృష్టించిందన్న అ
మాత్రం ఒకటే వారూ వీరూ ఇరువురూ ‘నిరపాయి’ (విడదీయరా
లైన దివ్యదంపతులే. అర్ధదేహులే.

భావం— ‘భవతి ఇతి భావః’ అనిఅర్థం. అంతా పుడుతోంది కా
భావమంటారు. ఇచ్ఛాదులన్నీ భావాలే. ఇవి మనిషిలో స్వతస్సిద్ధం
పుడుతున్నాయి. ఆ అర్థంలోనే బ్రహ్మ-స్వయంభువు. ఇక్కడ శక్తి
స్వయంభువు. అర్థం శబ్దాన్ని-శబ్దం అర్థాన్ని పుట్టిస్తున్నాయి ఈపరస్ప
సృష్టి పై చిత్రిఎలాంటిదోమరోమంత్రం చాలా అద్భుతంగా వివరిస్తుం

*బృహస్పతే ప్రథమం వాచో అగ్రం యత్ప్రైరత నామధేయందధా*
*యదేషాం శ్రేష్ఠా. యదరిప్రమాసీ త్ప్రేణాతదేషాం నిహితం గుహావి*

[ఋక్కు 28-10-71

(Oh : Bruhaspati : That was them the first begining of speach, when they put themselves to work giving names (to objects). All that they had of the best, the imaculate hidden in them, revealed itself under the effect of their love).

(ఓ బృహస్పతి! ఆ మొదట్లో అంతరూ కలిసి క్రియాకలాపాల్లోకి దిగినపుడు వస్తువులకి పేర్లు పెట్టబడ్డాయి. వాటిలో దాగిన సారభూతార్థాలు వారికి సామరాగంగా ప్రత్యక్షమయ్యాయి.)

అని బృహస్పతికి వాగ్దేవి బోధిస్తోంది. ఈ బృహస్పతినే 'సుమేధ' అన్నారు. ఆ బాణం ధరించిన వాణ్ణే 'రుద్రుడు'అన్నారు. (తరువాత చెప్పబోయేటట్లు వాడే 'కుమారుడు'కూడా). వాక్పతిగా ఆయన పేరు 'బ్రహ్మ', తత్తుల్య ప్రజ్ఞగల బ్రహ్మణ్యుడిపేరే 'సుబ్రహ్మణ్యుడు', వాడు దర్శనశక్తి చేత 'ఋషి' అవుతున్నాడు. ఈమె అందరికీ 'మహిషి'-పట్ట మహిషి. ఈమెనే 'రాజరాజేశ్వరి' అని తరువాత పిలిచారు. ఈమెలోని సర్వవ్యాపకత్వానికే 'విష్ణు' వనే పేరు వచ్చింది. అందుకే సరస్వతిని 'వైష్ణవి' అనే రూపంతోనూ పిలిచారు. 'దేవి' అన్నారు. శ్రీ'దేవి' అని కూడా అన్నారు.

—(o)—

అధ్యాయం - 3

# విశ్వరూపం

*దేవీం వాచమజనయంత దేవాః తాం విశ్వరూపాః పశవో వదంతి*
*సానో మంద్రేష మూర్జం దుహానా ధేనుర్వాగస్మా నుపసుష్టు తైతు*
(ఋక్కు 8-100-11)

[దేవతలు వాగ్ దేవతను ఉత్పాదించారు ఆ పథాశక్తి రెమె
వైఖరీ రూపాన్ని స్థూలదేహాభిమానులయిన విశ్వులు (మనుష్య
జాగృదవస్థలో నాలుకతో ఉచ్చరిస్తున్నారు అలాంటి వాగ్ధేనువు మామం
స్వరంలో స్ఫురణశక్తిని ప్రసవిస్తూ రక్షించుగాక- అస్మాన్. సాధక జ
అని అర్థం. చూ. కామకళావిలాసం. పు 159]

దేవతలకు సుమనసులనిపేరు. (వాగీశాద్యాః సుమనసః). దేవత
మనోరూపులు. తేజోమయ శరీరాలు కలవారు. "దిక్" అంటే ప్రకాశిం
మని అర్థం ఆ ప్రకాశాన్నే ఇంతకుముసుపు జ్ఞానమన్నది. ఆ దే
దేవతలు సృష్టించారు. విశ్వమంతా ఆమెను పలుకుతున్నాయి.
పలుకుతున్న ఈ పశువులకు "పతి" శివుడు కాగా, "మాత" ఈ
శివుడిని "పశుపతి" అనడంలో ఈ అర్థమే ఉంది. ఆవు అరిచే "అం
అనే అరుపునుండి 'పరబ్రహ్మ' శబ్ద పర్యంతం ఉన్న శబ్దజాలమంత
ఆ "దేవి" విస్తరించి ఉంది. అందుకే ఆమెను 'విశ్వరూప' అన్నా
ఆమె జ్ఞానమనే క్షీరాన్ని ప్రసాదించే "ధేనువు" కూడా ఆ "గో" వ
ప్రసాదించిన క్షీరంలోనే సర్వజగత్తూ బలిష్ఠమవుతోంది. ఇది వా
కున్న స్త్రీరూపం. ఇది వాక్ తత్త్వంలో ఒకముఖం.

ఇక్కడ లక్ష్మీ కామధేనువులు క్షీరసాగర మథనంలో నిర్గమించ
పురాణకథను అన్వయించుకుంటే ఈ తత్త్వములోని అమృతత్త్వం శ
పడుతుంది. దేవతలు - రాక్షసులు చెరొకవైపు 'వాసు'కి అనే సర్పా
చుట్టి 'మేరు' పర్వతాన్ని క్షీర సముద్రంలో పడవేసి చిలికారు. వి
పుట్టింది అక్కడే చివరికి అమృతమూ పుట్టింది. అక్కడ పుట్టిందే 'ల
అక్కడే కామధేనువుకూడా పుట్టింది. ఆ సాగరంలో పుట్టిన అమృత-చావు
శాశ్వత సత్యమే విశ్వరూప అయిన 'మోహిని'. ఈమె వైష్ణవ తేజ

కలిగిన శక్తి. ఈ మెను చూసి దేవతలు-రాక్షసులు-అందరూ భ్రమిం చారు. ఆమె చెప్పినట్టు ఆడారు. పాడారు.

ఇక వాక్ తత్త్వంలో తక్కిన సగం-పురుషరూపం. 'గోవు' శబ్దానికి సంస్కృతంలో 'ఆవు' అనీ 'ఎద్దు' అనీ కూడా అర్థాలున్నాయి ఈ రెండు పదాలూ స్త్రీ పుంద్యోతకాలైన ఒకేజంతు పర్యాయవాచకాలేకదా! అందుకే వాక్కులో పురుషాంశకూడా ఉంది. దీన్నే 'వృషభాంశ' అన్నారు.

చత్వారిశృంగో త్రయో అస్యపాదా
ద్వేశీర్షే సప్త హస్తా సో అస్య
త్రిధా బద్ధో వృషభో రోరవీతి
మహోదేవో మర్త్యామావివేశ

(ఋక్సం. 4-58-3)

(ఒక ఎద్దు రంకెవేస్తున్నది. దానికి నాల్గు కొమ్ములు, మూడు పాదాలు, రెండు తలలు, ఏడు చేతులు. ఆ ఎద్దుకు రొమ్ముల వద్దా, మెడ దగ్గరా, తల దగ్గరా కట్టేశారు. అలాంటి మహాదేవుడు మనుష్యుల నావేశిం చాడు.)

మహాభాష్యకారుడైన పతంజలి మహర్షి పై మంత్రానికి ఈ విధంగా వ్యాఖ్యానం చెప్పాడు.

"చత్వారి శృంగాణి - పదజాతాని, నామాఖ్యాతోపసర్గ నిపాతశ్చ; త్రయోఅస్యపాదాః- త్రయ్యఃకాలాః- భూత భవిష్యద్వర్తమానాః- ద్వేశీర్షే ద్వేశబ్దాత్మనే- నిత్యఃకార్యశ్చ - సప్తహస్తాసో అస్య - సప్త విభక్తయః- త్రిధాబద్ధః- త్రిషు స్థానేషు బద్ధః- ఉరసి- కంఠే- శిరసేతి, వృషభో వర్ష ణాత్- రోరవీతి- శబ్దంకరోతి.

[నాలుగు కొమ్ములు నాలుగు రకాల పదాలు-నామ, ఆఖ్యాత, ఉపసర్గ, నిపాతాలని నాలుగురకాల పదాలున్నాయి; త్రికాలాలు-మూడు పాదాలు-భూత భవిష్యద్వర్తమానాలు, రెండు తలలే. నిత్యకార్యరూపా

లుగా ఉన్న శబ్దాత్మలు, ఏడుజేతులే-సప్తవిభక్తులు, మూడుబంధాలు రొమ్ము, మెడ, తలలదగ్గర ఇక్కడ రంకె-వేయటం-శబ్దించటం మః దేవః, మహాన్‌దేవః శబ్దః, మర్త్యాం-మరణధర్మాణో మనుష్యామ్ః(మర ధర్మం) కల్గిన మనిషిని - అవివేశ - ఆవేశించింది - అనగా శబ్ద మనిషిలో ప్రవేశిస్తోంది.

శబ్దం ఆసంకల్పితంగా మనిషిలో ఆవిర్భవిస్తోంది. పశుపక్షు దుల్లో లాగానే సహజస్పందంలో భాగంగా స్వచ్ఛందంగా శబ్దోత్పాద జరుగుతోంది. ఇంచేత అద్భుతమైన శబ్దం మరణధర్మమున్న మనిషిలో అను ప్రవేశిస్తుంది.

ఇప్పుడు మొదట ప్రస్తావించిన చత్వారి వాక్ పరిమితా పదా ఇత్యాది మంత్రంతో ఈ మంత్రాన్ని కలిపి చూసుకుంటే ఆ మంత్రార్థ సమృద్ధిగా తెలుస్తుంది ఆ మంత్రంలో శబ్దానికున్న నిత్యత్వాన్ని, మంత్రంలో శబ్దానికున్న కార్యాన్ని వైదిక మహర్షి సంస్థాపిస్తున్నాడ శబ్దం రెండు ముఖాలు కల్గింది. ఒకటి అవ్యక్త ముఖం. పరాపశ్య మధ్యమారూపమైన వాక్కు అవ్యక్తమైంది. అది నిత్య శబ్దాత్మ వైఖ వాక్కు మనిషిని ఆవేశించి బయటపడుతున్నది. అనగావాడు మాట్లా తున్నది. ఇదే అనిత్య- కార్యరూపమైన శబ్దాత్మ. ఆ వృషభుడే ః తలతో గుహలోదూరి; మరొక తలతో లోకంలోని మనిషిద్వారా శబ్దక్రి నిర్వహిస్తున్నాడు. (ఇవే రెండు తలలు)

*అపి ప్రయోక్తు లాత్మానం శబ్ద మంతర వస్థితమ్*
*ప్రాహుర్మహా న్త వృషభం యేన సాయుజ్య మిష్యతే*

[ప్రయోక్త యొక్క ఆత్మ రూపమైన శబ్దం ఏది ఉందో దానే వృషభమని చెబుతారు. దానితోనే సాయుజ్యాన్ని కోరుతారు ]

ఈ వృషభరూపుడైన మానవుడిలోఉన్న నిత్య చైతన్య స్వ పుడూ వృషభుడే. వాడే బ్రహ్మణ్యుడు. మనీషి వానికి లోనదాగిఉన అవ్యక్త వాక్ ప్రపంచాన్ని గురించి తెలుసు. ఇలా శబ్దిస్తున్న వృష రూపునికి,జ్ఞానక్షీరాన్ని అంది స్తున్నగోరూపిణికి,చెందిననిత్యదాంపత్య

విశ్వానికి రూపకల్పనచేస్తోంది. అందుకే దేవిని "విశ్వరూప" అన్నా, శివుడిని "విశ్వాత్మ"డన్నారు వెరసి శబ్దమే "విశ్వరూపం".

విశ్వంలో శబ్దంచేత బోధింపబడని భావంలేదు. ఏభావాన్నీ బోధించని శబ్దమూలేదు. శబ్దంలో భావం, భావంలోశబ్దం నిరంతరం ఇమిడి ఉన్నాయి.

*నసోఽస్తి ప్రత్యయోలోకే యః శబ్దానుగమాదృతే*
*అనువిద్ధ మివ జ్ఞానం సర్వం శబ్దేన భాసతే*

(వాక్యపదీయం 1-124

[There is no idea which is not embodied in word.
All knowledge is manifested by word]

[శబ్దాన్ని అనుసరించకుండా అందుకోదగిన ఏప్రత్యయమూలేదు అం ఏ భావాన్నీ శబ్దం సహాయం లేకుండా అందుకోలేము. జ్ఞానం అనువిద్ధంగా ఉన్నందువల్ల సర్వమూ శబ్దం చేతనే భాసిస్తున్నాయి]

ముందు ప్రస్తావించినట్టు శబ్దాన్ని బ్రహ్మమని అనటంలో ఇం మహార్థమూ దాగి ఉంది. శతపథ బ్రాహ్మణంలో ప్రజాపతికి కూడ అతీతమైన తత్త్వం 'వాక్కు' అని ప్రస్తుతించబడింది.

*'యద్వాః ప్రజాపతేః పరమస్తి వాగేవతత్' (శ. బ్రా.)*

అథర్వణ వేదం ఆ బ్రహ్మలో లీనంకావటమే వాక్ ప్రక్రియకు పరవ గమ్యమని చెబుతోంది.

*'వదంతి యత్ర గచ్ఛంతి తదాహుర్బ్రాహ్మణంమహత్'*

(అ.వే. 10-8-33

అంచేత విశ్వమయంగానూ, విశ్వోత్తీర్ణంగానూ ఉన్నది వా తత్త్వం. లింగవచనాలకు అందని మహాతత్త్వంగాబట్టే వృషభ గోరూప లుగా వర్ణింపబడింది.

వృషభరూపంలో చెప్పబడింది వైఖరీరూపంగా విభక్తమైఉన్న భాషను గురించి ఇక్కడే పదపద వాక్య విభజన కుదురుతుంది. ఇద

అనిత్యా గోరూపంలో చెప్పబడింది. పరాపశ్యంతీ మధ్యమ రూ:
అవిభక్తమై ప్రపంచమంతటినీ ఆక్రమించిన శబ్దం. ఇదినిత్యశబ్ద
కనుక 'చత్వారివాక్ పరిమితాపదాని' అనే మంత్రం ఖార
మహర్షుల వాగ్ దర్శనాన్ని సూత్రీకరిస్తోందని అర్థం చేసుకోవచ్చు.

—(౦)—

అధ్యాయం - 4

## చత్వారి వాక్కు

మునుపు ప్రస్తావించిన 'చత్వారివాక్ పరిమితాపదాని' ఇత
మంత్రంలో చెప్పబడిన చతుర్విధ వాక్కుల లక్షణాలు చూద్దాం.

*వైఖరీ శబ్ద నిష్పత్తిః - మధ్యమా శ్రుతి గోచరా*
*అంతరార్థాపపశ్యంతీ - సూక్ష్మవానవపాయినీ*

(మహాభాష్యంలో హరిదీక్షితుడుదాహరించిన శ్లో

నిష్పాదన ప్రక్రియ ఉన్న శబ్దం వైఖరి. శ్రుతి గోచర మా
మధ్యమ అంతరార్థ రూపం పశ్యంతి. వాక్కుతో ఎడబాటు లేకుండా ఉ
అంతశ్చైతన్య స్రవంతి 'పర'.

దీన్ని దర్శించిన 'మనీషి' ఎవరు ? వాడెందుకు ఈ గుహల
ప్రవేశించాడు ? ప్రవేశించి బ్రహ్మజ్ఞుడెలా అయ్యాడు ?

మహాభాష్యంలో పతంజలి మహర్షి ఈ ప్రశ్నలను వేసుకొని
చెప్పాడు.

"మనస ఈషిణః - చిత్తశుద్ధి క్రమేణ వశీకర్తారః - విషయా
దేభ్యో వ్యాకృత్యాహింసకావా-తేచవై యాకరణాః- అన్వేష్టాం తద
హేతు మూహ గుహేతి"

[వైయాకరణులు మనీషులు. ఎందుకంటే చిత్తశుద్ధిచేత విః యాంతరాలనుంచి అహింసా పద్ధతిలో విముఖులైనందువల్ల. అంచే వారికి ఆతత్త్వం స్పష్టంగా కనిపిస్తుంది. ఆ జ్ఞానంలేనివారికి అదిగుహ

వాడికి మోక్షేచ్ఛ ఉంది. అందుచేత శబ్దతత్త్వం చిత్తశుద్ధి క్రమం లోనే వశీకృతమవుతోంది. వైయాకరణులు అలా శబ్దశుద్ధిద్వారా చిత్త శుద్ధిని తద్వారా జ్ఞాన సంపాదనకు అర్హతను సంపాదించుకొన్నవారు. జ్ఞానంలేని ఇతరులకు అదంతా ఒక పెద్ద "గుహ"లా ఉంటుంది. అంత చిమ్మ చీకటి. ఏమీ కనబడదు. వారి అజ్ఞానమే ఈ "గుహ".

శబ్దాన్ని సుష్ఠుగా ఉచ్చరించిన వాడు మోక్షాన్ని; అపశబ్ద ప్రయోగం చేసినవాడు నరకాన్ని చూస్తాడన్న నియమం ఈ కారణంగ పుట్టిందే అందుకే వేదవిప్రునికి శబ్దార్థ పరిజ్ఞానం సుష్ఠుగా ఉండాలని మహాభాష్యం హెచ్చరించి ఉంటే లాభం ఏమిటంటే :

"వైయాకరణాస్తు శాస్త్ర బలేన తద్బల లబ్ధ యోగేనచ
గుహాంధకారం విదార్య సర్వం జానాతీతి భావః"

అని మహాభాష్యం వివరిస్తోంది. వ్యాకరణ-శబ్దశాస్త్ర-బలం ఒక యోగ బలం లాంటిది. ఆ బలంతో ఆ మహాంధకారాన్ని పటాపంచలు చేసి వైయాకరణి సర్వాన్ని తెలుసుకోగలుగుతాడు. వాడినే "బ్రాహ్మణ్యో' డన్నారు. ఇది పద ప్రత్యయ విశ్లేషణకు మాత్రం పరిమితమైన శక్తి కాదు. అఖండమైన శబ్ద శక్తిని గుర్తించడానికి స్ఫుటమైన ఈ ఖండ శబ్ద విభాగాన్ని ఆధారంగా గ్రహించడానికి అనుగుణమైన "దర్శనం" ఆ దర్శనాన్ని పాణిన్యాది మహర్షులు కలిగి ఉండటంచేతనే సుష్ఠు/సాధు శబ్దం ఇలా ఉంటుందని ఉండాలని అనుశాసనం చేశారు.

ఆ బ్రహ్మణ్యుడి "వాక్కు' పరిశోధితమైంది. పునీతమైంది. కనుక ప్రామాణికమని అర్థం. అగ్నిలాగా శుచిమంతుడు కాబట్టి బ్రాహ్మణం విరాట్పురుషుని ముఖస్థానీయుడన్న వర్ణన చేయబడింది.

*బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్*
*బాహూ రాజన్యః కృతః*
*ఊరూ తదస్య యద్వైశ్యః*
*పద్భ్యాం శూద్రో అజాయత - అని పురుషసూక్త మంత్రం*

ముఖం ద్వారా శబ్దం బహిర్గమిస్తుంది. కనుకనే విరాట్పురు ముఖాన్ని చొచ్చి అగ్ని వాక్కుగా అవతరిస్తున్నాడని ఒక మం చెబుతోంది.

*"అగ్నిర్వాగ్భూత్వా ముఖం ప్రావిశత్" (ఐతరేయోపనిష*

ఈ అగ్ని - మొదట ప్రస్తావించిన బ్రాహ్మణ్యుడే. దేవతా లలో అగ్ని బ్రాహ్మణుడు(ఇంద్రుడు-క్షత్రియుడు, కుబేరుడు-వైశ వరుణుడు-శూద్రుడు) యజ్ఞప్రక్రియలో అగ్ని దర్శనంలోనే మంత్రాలు ఆవిర్భవించాయి.

*ఓం అగ్నిమీళే పురోహితం ఇంద్రస్య దేవకృత్విజం*

ఇత్యాది అగ్ని స్తుతి పరంగానే ఋక్కులు ఆవిర్భవించా అందుకే అగ్ని వాక్కుగా మారి బ్రాహ్మణుడి నోటిలో ప్రవేశించాడ వర్ణనగా ఉపనిషత్తులో కనిపిస్తోంది ఈ వాక్కు పరమపవిత్రమై"భ ప్రదాయకంగా ఉన్నందువల్ల యజ్ఞానికి సముచితార్హతను సంపాది కొంది. ఏలా పవిత్రమైందో ఋగ్వేదం ఇలా చెప్పింది.

*సక్తుమివ తితఉనా పునంతో యత్ర ధీరా*
*మనసా వాచమక్రత*
*అత్రా సఖాయ. సఖ్యాని జానతే*
*భద్రైషాం లక్ష్మీ న్నిహితాధివాచి*

[ఋ.సం. 10-81-2]

[ధీరులైన పండితులు జల్లెడతో పిండిని జల్లెడ పట్టినట్లుగా మ నుంచి వాక్కును సిద్ధం చేశారు. అలాంటి జ్ఞానవంతులు వాక్కుకు సం ధించిన జ్ఞానాన్ని తెలుసుకొని ఉంటారు. వారి వాక్కులో కల్యాణ మైన లక్ష్మి ఉంటుంది.]

యజ్ఞంకోసం పిండిని జల్లెడపట్టి శుభ్రంచేసిన విధంగా "ధీరులు" మన సుతో శోధించి శోధించి "వాక్కు"ను తయారుచేశారు. ఈ శోధనే "అగ్ని" రూపకమైన యజనప్రక్రియ. ఇది విశ్వమనోదశలో జరిగినపుడు దేవతలు వాక్కును సృజించారన్న అర్థం ఏర్పడుతుంది.

ఇలా సృష్టింపబడ్డ "వాక్కును" అందరూ దర్శించగలరా? అంద రికీ ఒకవిధంగా "వాక్కు" అర్థమవుతున్నదా ! అలాకావడంలేదు. ఆకాశ దర్శనం ఏ ఒక్కరికో జరుగుతోంది.

*ఉతత్వః పశ్యన్ నదదర్శవాచమ్*
*ఉతత్వః శృణ్వన్ నశృణోత్యేనామ్*
*ఉతోత్వస్మై తన్వం విసస్రే*
*జాయేవ పత్య ఉశతీ సువాసాః*

(ఋ. సం. 10.81-4)

[కొందరు చూస్తున్నారు కాని దర్శించలేకపోతున్నారు. కొందరు వింటున్నారు. కాని వినలేకపోతున్నారు. పరమపతివ్రత తనభర్తకు మాత్రమే తన ఆచ్ఛాదనల్ని తొలగించి స్వస్వరూప దర్శనమిచ్చినట్టు ఏ ఒకడికో ఆ సంపూర్ణనాద్ దర్శనం కలుగుతుంది.]

నేను ఎవర్ని అనుగ్రహిస్తానో వాడిని "సుమేధున్ని" చేస్తానన్న సరస్వతీ సూక్తానికి అర్థం ఇదే. వక్తలోనుంచి పుట్టిన వాక్కు వక్తనే అందిస్తోంది. ఆ వక్తకు "సార" భూతమైన దివ్యసఖత్వాన్ని వాక్కు అలా వక్తతో వాక్కుకు నిత్యదాంపత్యముంది.

అందుకే పురుషస్య వాగ్రసః అని ఛాందోగ్యోపనిషత్తు సూత్రీం చింది. "రసోఽహమప్సు కౌంతేయ" అని భగవద్గీతాకారుడు అంభస్సుల రసమే పరమాత్మ అని చెబుతున్నారు. అంభస్సులలో పుట్టిన ఆదేశ తత్త్వమే "వాక్కు" అయినపుడు పురుషునికి "వాక్కు" రసరూపమే అవుతోంది. "రసం"లాగా "వాక్కు"కూడా "సరస్" రూపంకల్గిందే. రెండూ ప్రవాహ ధర్మాన్ని కల్గినవే. కనుకనే పురుషునికి రసరూపం

"వాక్కు"ని ఉపనిషత్తు సిద్ధాంతం చేసింది. ఆహతరూపంలో "వాక్కు" కాగా, అనాహతరూపంలో "రసం" ఈ రెంటినే లౌకికంగ "శబ్దార్థాలు" అని అంటాం—ఈ లౌకిక-అలౌకిక రూప సంబంధ శబ్దారాలలో కూడా ఉంది.

వాగర్థావివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే
జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ

అని రఘువంశ కావ్యం ప్రారంభంలో కాళిదాసు స్తుతింతంది. ఇ రససిద్ధికోసమే. వాగర్థ ప్రతిపత్తిద్వారా ఏర్పడేది "రసం". శివపార్వ తులు శబ్దార్థాల్లాగా అవిభాజ్యంగా ఉన్నారు. వారి నిత్యదాంపత్యమే వాగర్థాల నడుమ నిరంతరం సాగుతున్న "జీవన" ప్రక్రియ.

ఆమెపేరు గిరి-జ. "గిరి" అంటే మళ్ళీ వాక్కే. ఆయన రుద్రుడ —అంటే శబ్దించేవాడని వారి కుమారుడు మళ్ళీ సుబ్రహ్మణ్యుడు వాడ జన్మించగనే క్రౌంచపు డొక్కను చీల్చాడు. ఇదే గుహ విచ్ఛేదనం అందుకే కుమారునికి గుహుడనికూడా పేరుంది. అంటే నిహితంగా గుహలో ఆణగిఉన్న మూడు వాక్కులను ఎరిగినవాడని అర్థం. యోగేశ్వరుడని తాత్పర్యం.

వాగ్వై సుబ్రహ్మణ్యః
వాగ్వై బ్రహ్మచ సుబ్రహ్మచ

(ఐతరేయ బ్రాహ్మణం- 6-3)

అందుకే సుబ్రహ్మణ్యుడు "భారతీ" స్వరూపం అవుతున్నారు. మహావిద్యారహస్యవేత్త అనిఅర్థం. అందుకే కుమారుడు విద్యావేత్తలు విద్యాప్రవర్తలుకూడా ఇలా సుబ్రహ్మణ్యుడు "గుహా" మూర్తి అవుతున్నాడు.

శివ పార్వతుల దాంపత్యంగా ఇక్కడ చెప్పబడింది. ముసుపు వాక్పతి-వాక్కుల దాంపత్యంగా చెప్పబడినదీ ఒకటే. ఇంతే కాకుండా భిన్న పత్రికలద్వారా ఇదే దివ్య దాంపత్యం చెప్పబడింది.

ఈ సుబ్రహ్మణ్య తత్త్వాన్నే 'అగ్ని'గా, 'ప్రజాపతి'గా, 'విరాట్టు'గా, 'పరమేష్ఠి'గా చెప్పిన సందర్భాలున్నాయి.

సప్తమహర్షులు యజ్ఞం చేస్తుండగా వారి ధర్మపత్నులను చూసి 'అగ్ని' చలించి వారి సంగమం కోరుతాడు. భర్తకు తెలియకుండా అగ్నిదేవుని భార్య స్వాహాదేవి ఒక్క అరుంధతి తప్ప తక్కిన ఆర్గురుపత్నుల ఆకారాల్ని ధరించి అగ్నితో క్రీడించి అగ్ని తేజస్సును సంగ్రహించింది. ఆ ఆరుముఖాల తేజస్సును కృత్తికలు పెంచి పెద్దచేసిన కథఒకటుంది. ఇలా అగ్నిదేవుడే కుమారుని తండ్రి. ఈ అగ్ని శివుని అష్టమూర్తులలో ఒకడు. ఇలాకూడా అగ్నితత్త్వమే వాక్కుగా పరిణమిస్తోందన్న మంత్రం ఈ కథద్వారా సమర్థింపబడుతోంది. శివుని తేజస్సును అగ్ని ధరించి గంగలో విసర్జించాడన్న కథకూడా ఈ మహార్థాన్నే మరోరూపంలో వర్ణిస్తోంది. ఇలా ఆ సుబ్రహ్మణ్యుడు అగ్నిరూపుడవుతున్నాడు.

ఆ బ్రహ్మణ్యుడు "ప్రజాపతి" స్వరూపుడు.

> "ప్రజాపతిర్వా ఇదమగ్ర ఆసీత్ - తస్యావాక్ ద్వితీయా ఆసీత్ తాం మైథునం సంభవత్ - సాగర్భమాధత్తా"
>
> (తాండ్య బ్రాహ్మణం 20-14-2)

(ప్రజాపతి తొలుత ఉన్నాడు. అతని భార్య వాక్కు. వారిద్దరికీ కలయిక ఫలితంగా ఆమె గర్భం ధరించింది. - బ్రహ్మ సరస్వతుల కుమారుల పేర్లే ఇక్కడున్న ప్రజాపతి-వాక్కు. వారి కలయికతో- "జ" పుట్టినవారు ప్రజలు.)

వాక్కును విరాట్టుగా చెప్పిన మంత్రాలున్నాయి.

"వాగేవ విశ్వా భువనాని" (ఐ. బ్రా. 14.3.10.)

"వాగ్వై విరాట్, వాగ్వై ప్రజాపతిః" (శత. బ్రా. 3 5-1-3 4 5-1-5-6)

ప్రపంచంలో ప్రతి వస్తువు పుట్టే ధర్మం కల్గింది. ఈ ప్ర"జనక" శక్తి ప్రజాపతి. అతను శబ్దాన్ని ఆధారాన్ని సర్వసృష్టి చేశాడు కాబట్టి విశ్వమంటే "వాక్కే", వాక్కు విరాట్ రూపమే "విశ్వం".

వాక్కు పరమేష్ఠి (పరమే పరస్థానంలో; స్థ ఉన్నది)గా చెపా
అచోట పరమేష్ఠి పరమేష్ఠిని ఇద్దరూ ఉన్నారు. బ్రహ్మకుకూడా "పర
అన్న పర్యాయ వాచకముంది.

"పరమేష్ఠినీ వాక్" (ఋక్కు 10-125-3)

ఆమె పట్టమహిషి. అందుకే "మహిషీవాక్" (శత. బ్రా. 6-2-4)

వాక్కుకున్న ప్రవాహలక్షణాన్ని సూత్రించిన మంత్రాలునా
'వాగ్వై సర్వారాజ్ఞీ' (కౌషీతకీ బ్రాహ్మణోపనిషత్)

"స" ధాతు జన్యమే సర్వం-సరస్వతి. "కాలువ"గా వాక్కును దర్శిం
మంత్రమూ ఉంది.

"తస్యాః మనసా ఏషా కుల్యావాన్" (జాబాలి ఉపనిషత్)

"కుల్య" - కాలువరూపంలో ప్రవహిస్తుంది. శబ్ద తరంగరూప ప్రవా
ఇలా నిరూపించబడింది. దీన్నే "యోని"గా కూడా సంకేతించారు.

"వాగ్ యోనిః' (ఐతరేయ బ్రాహ్మణం 2-38)

"యోని" జనుస్థానం. వాక్కు సర్వవస్తు జనుస్థానం కాబట్టి "యోని
అవుతోంది. జగన్మాతృమూర్తిగా కాళిగా - లక్ష్మిగా - సరస్వతి
అర్చింపబడుతున్నది ఈ యోని తత్త్వమే. శ్రీ చక్రరూపం
తాంత్రిక నిర్వచనం. ఈ యోనినే "గుహ" అని, "రాత్రి" అని
పిలిచారు.

ఈ చీకటిలో మెరపుతీగ (తటిల్లత) లాగా ఆమె ప్రకాశిస్తే
వికసిస్తోంది. ఈ వికసనాన్నే "విమర్శాంశ" అన్నారు. విమ
"ఉన్మేష" మని కూడా పిలిచారు పద్మమని పుష్పమని కూడా పిలి
పూవులో వికసనం-ముడుచుకుకోవటం రెండూ ఉన్నాయి. అలాగే
నేచ్ఛా రూపమైన పరమేశ్వరునిలోని ప్రథమ స్పందాన్నే విచి
(చికితుషీ-చికేత-నచికేత-వంటిరూపాలను ఇక్కడ అనుసంధించుకో
నే చిత్ శక్తిగా చెప్పారు.

యస్యోన్మేషనిమేషాభ్యాం జగతః ప్రళయోదయౌ
తం శక్తి చక్ర విభవ ప్రభవం శంకరంనుమః
(స్పందకారిక ప్రథమ శ్లోకం)

[ఎవరి ఉన్మేష నిమేషాలు జగత్తుకు ప్రళయాన్ని, ఉదయాన్ని ఘటిస్తున్నాయో, అలాంటి శక్తిచక్రవిభవుడై ప్రభవిస్తున్న శంకరునికినమస్కారం]

ఈ ఉన్మేష లక్షణాన్ని మహాభాష్యం కూడా వివరించింది. "గుహా యాంత్రీణి నిహితాని నే జ్గయంతి" అన్న మంత్రపాదాన్ని వివరిస్తూ పతంజలి మహర్షి 'నేజ్గయంతి" అన్నమాటకు

"నచేష్టంతే - నిమిషంతీత్యర్థః" - అని అర్థ వివరణ చేశాడు. జ్ఞాన సామాన్య విషయత్వాభావం దీనిచేత సూచింపబడుతోందని ఉద్ద్యోత వ్యాఖ్యాకారుడు మరలా దీన్ని వ్యాఖ్యానించాడు. దేవతలు రెప్పపాటు లేనివారు. అందుకే వారిని "అనిమిషులు" అంటారు. అక్కడ లౌకికమైన చేష్టాదులు-లేని కారణంగా వారిని తేజోమయరూపాలుగా చెబుతారు. అలాగే గుహలోని మూడు వాక్కులుకూడా - పదప్రత్యయరూపమైన "వ్యాకృతి" కల్గినవికావు అవి అవ్యాకృతాలు. వాటిని ఇంద్రుడు తన వజ్రాయుధంతో వ్యాకరించినట్టు చెప్పిన కథకూడా ఉంది.

వాగ్ హి వైంద్రీ (శత. బ్రా. 9-2)

తైత్తిరీయ సంహితలో ఇంద్రుడు'ఐంద్రి' రూపమైన ఈవాక్కును ఎలా వ్యాకరించారో చెప్పబడింది.

'వాగ్వై పరాచ్య వ్యాకృతా వదత్.
దేవా ఇంద్రమబ్రువన్
ఇమాంనో వాచం వాకుర్విత.
తాం ఇంద్రో మధ్యతోఽ వక్రమ్య వ్యాకరోత్'
(తై. సం. 6-4-7)

తొలుత పరావాక్కును అవ్యాకృతంగానే మాట్లాడుతున్నారు. దేవతలు ఇంద్రుడితో దీన్ని వ్యాకరించమని కోరారు. ఇంద్రుడా వాక్కును సరిగా "మధ్యకు" వ్యాకరించారు అంటే నరికాడని అర్థం.

సప్తమరుత్తుల కథకూడా ఇలాంటిదే.

దితి కశ్యపుల సంతానం వీరు ఇంద్రుడు దితి గర్భంలో పె
తున్న వీరిని వజ్రంతో ఏడు ముక్కలుగా కోస్తుండగా వారు ఏడ
మొదలుపెట్టారు. మారుద! మారుద! అని (ఏడవకు!) ఇంద్రుడన్నా
అంచేత మరుత్తులని పేరువచ్చింది. వారిని ఏడు ఏడు విభాగా
కోయడంవల్ల సప్తమరుత్తు లయ్యారు'

(బ్రహ్మ, మత్స్య పురాణాల కథసమిది)

ఈ ఇంద్రుడే ఇంద్రియాదులలో ఉన్న స్ఫురణరూప
ప్రజాపతితత్త్వం.

"సమేంద్రో మేధయాస్పృణోతు" [తైత్తిరీయోపని.

ఇంద్రుడు రచించిన 'ఐంద్ర' మనే వ్యాకరణం ఉండేదట
వైయాకరణ సంప్రదాయంలోనూ ఒక వార్త మిగిలింది, ఇ
ఇంద్రుడు వ్యాకరించింది ఆగుహాగతమైన పరాపశ్యంతుల
వైఖరికి నడుమఉన్న మధ్యమ వాక్కును అందుకే "సంహిత"మ
అనిఅన్నది. అది శ్రుతిమాత్రగోచరం. దీన్ని "బృహతీ" వా
కూడా అన్నారు.

"బృహతీ" వాక్కు లేదా ఇంద్రపత్నీవాక్కు అక్షరము అ
విడివడినదశ' ఇదే మధ్యమవాక్కు వైఖరికీ పశ్యంతికి మధ్యను
కనుక ఇక్కడ శబ్దార్థాల వేర్పాటున్నా రెండూ కలిపే ఉంటాయి"

[కుమారభారతి II]

ఇదంతా దేవీ (సరస్వతీ) సూక్తాలలోని "ఇంద్రాదులను
భరిస్తున్నా"నన్న మంత్రార్థమే.

"సరస్వతి యోన్యాం గర్భమంతరశ్విభ్యాం పత్నీ
సుకృతం బిభర్తి' (వాజసనేయసంహిత)

సరస్వతి గర్భంలో అశ్వినీదేవతలున్నారు.

"అశ్విభ్యాం దుగ్ధం భిషజా సరస్వత్యా"

(వాజసనేయసంహిత)

పై ఉదహరించిన దేవీసూక్తంలో ఇద్దరు అశ్వినుల్ని భరిస్తున్నారన్నమాటకుకూడా అర్థం ఇదే.

"అశ్వినులే స్కంధ విశాఖులు ప్రాణ అపానశక్తులు. ప్రాణం ఊర్ధ్వ ప్రసరణశీలమైనశక్తి. అపానమధః ప్రసరణశీలమైనశక్తి"

[కుమారభారతి XV]

"అథ ఇంద్ర యత్ర వజ్రం ప్రాహరత్ తచ్ఛ కలోఽస్య శీర్యత
స పతిత్వా శరోఽభవత్ తస్మాత్ శరోనామ యదశీర్యత"

[మత్స్యపురాణం 1-2-4-2]

కుమారుని కథలో ఇంద్రుని వజ్రాయుధం కుమారుని (స్కందుని) తాకగానే విశాఖుడు పుట్టినట్లు చెప్పబడింది. స్కందుడే ఆ పశ్యంతి వాక్కు కాగా వజ్రం మధ్యమ (విశాఖుడు) పుట్టింది.

"భౌమప్రజ్ఞ - దివ్యప్రజ్ఞ అని రెండురకాలుగా శ్రుతికథితం. దివ్యప్రజ్ఞకు అధిష్ఠానదేవత ఇంద్రుడు. అందుకే అతడు వృద్ధశ్రవుడనబడ్డాడు. అంటే పండితుల దగ్గర విషయాలు విని తెలుసుకున్నవాడు - పండితుడని "అయంవా శిశుః-మధ్యమ ప్రాణః" అని శతపథబ్రాహ్మణం. అష్టమూర్తులు శరీరం-కాబట్టి అందులోకి మధ్యమ ప్రాణశక్తి ప్రవేశించి జీవుడైనాడని శతపథమే చెబుతోంది. మధ్యమ ప్రాణం ఇంద్రుడు"

[కుమారభారతి XXXI]

ఇలా వ్యాకృతమైన మధ్యమావాక్కు లోకంలోని సమస్తజీవరాశుల లోకి ప్రవేశించి వైఖరిగా వ్యాపిస్తోందని శ్రుతికథనం.

"సహోవాచక-తురీయం తురీయం చేన్మామ భీభజున్. తురీయమేన వర్ణ్య వాఙ్నిరుక్తం న దిష్యతీతి. తదేతత్ తురీయం వాచో నిరుక్తంయన్మ

నుష్యా వదంత్యథైత్త్యాత్. తురీయం యత్ పశవో వదంత్యథైతత్. యం వాచో నిరుక్తం యద్ వయాంసి వదంత్యథైతత్ తురీయం నిరుక్తం యదిదం క్షుద్రం సరీసృపం వదతి" [శత. బ్రా. 4-1-

నాల్గవ వాక్కును మనుష్యులు మాట్లాడుతున్నారన్న మంత్రా నికి శతపథం ఇస్తున్న వివరణ ఇది. మనుష్యులు పశువులు-సరీసృప ఇవన్నీ 'తురీయ" వాక్కునే మాట్లాడుతున్నాయి. మనుష్యులతో, పశుపక్ష్యాదులు కూడా "వైఖరి" ని మాట్లాడుతున్నాయని ఋష దర్శించారు.

"They (i.e , the ancient Indians) recognised three st in the development of language : 1) Inarticulate speech Primitive articulate speech and 3) Language proper. Of first stage again, four grades are noted and three among t are deposited in secred and move not (R.V.1-164-45). Accor to Satapatha Brahmana (IV-1-3-16) the first grade is represe by the kissing of the serpents and humming of the insects. is followed in its second grade by the noter of birds and inarticulate speech of the bruks forms the third stage. As reg the second stage, the Rg. Veda explains that it was first em yed by men in imparting names to objects which later led to third stage, viz., the language proper, which was created by wise" [Prof. H. S. Ananthanarayana : 1

[ప్రాచీన భారతీయులు భాషా వికాసంలో మూడు దశలు గుర్తిం మొదటిది నిరుక్తవాక్కు. రెండవదశ మూలోక్తి దశ. మూడవది రణ భాష. మొదటి నిరుక్తదశలో, మరలా నాల్గు సూక్ష్మ దశలు యని ఋగ్వేదం ప్రతిపాదించింది. ఋగ్వేద మంత్రం చత్వారి ఇత్యాదిగా (1-164-45) ఆ నాల్గు వాక్కులలో మూడు గుహలో యని అవి కదలవని చెబుతోంది శతపద బ్రాహ్మణం (IV-1-3-16) నాల్గు దశలనూ వివరించింది. మొదటి దశ పాముల "బుస"ల్లోను కాల ధ్వనుల్లోనూ కనిపిస్తుంది పక్షుల కూతల్లోనూ, పశువుల అరుపు రెండుమూడు దశలు ఉన్నాయి. ఇక రెండవ దశలోని మూలోక్తి

పదార్థాలకు పేర్లుపెట్టడానికి సంబంధించింది. [క్రమంగా మూడవదైన సాధారణ భాష ఏర్పడుతోంది. దీన్ని బుద్ధి ఉన్నవారు సృష్టించారు]

పశుపక్ష్యాదులలోనూ ఈ వాక్ తత్త్వదర్శనం చెయ్యటం వల్లనే గోవు (ఎద్దు-ఆవు)గా, పాముగా, నెమలిగా, కోడిగా వాక్కును ప్రతీకరించిన సందర్భాలున్నాయి. ఆదిశేషుడు నవ వ్యాకరణనిధి. వర్ణనకు పడగను సూచకంగా చెప్పారు (ఆదిశేషుడైనా వర్ణింపలేదని) దాక్షిణాత్య సంప్రదాయంలో నెమలి, కోడి కుమారస్వామి వాహనాలుగా చెప్పబడ్డాయి.

ఋగ్వేదంలోనే దేవతలు, మనుష్యులు, జంతువులు మాట్లాడేది వాక్కునే అని చెప్పటం ఈ సందర్భంగా స్మరించుకోవాలి.

'దేవీం వాచమజనయంత దేవాః తాం విశ్వరూపాః పశవో వదంతి' (ఋక్కు 3-3-6)

ఈ నేపథ్యంలో "చత్వారి శృంగా"-అనే పూర్వోక్తవేదమంత్రాన్ని యాస్కాచార్యుడు కేవలం భాషాపరంగా కాకుండా "యజ్ఞ"పరంగా ఎలా వ్యాఖ్యానించారో చూద్దాం.

"నాలుగు కొమ్ములు నాలుగు వేదాలు; మూడు పాదాలు - త్రివిధ సవన క్రియలు; రెండు తలలు- ఉత్తర దక్షిణాయనాలు; ఏడుచేతులు- ఏడు వైదిక ఛందాలు; మూడు బంధాలు - మంత్ర, బ్రాహ్మణ, కర్మలు"

ఈ వ్యాఖ్యను ఆధారంగా తీసుకొని ఈ సంఖ్యాతత్త్వాన్ని మరింత లోతుగా దర్శించిన మహనీయులూ ఉన్నారు.

"There can be other interpretation too. For instance, th four horns can be the four locations of speech, *Pa-a* (the latent Pasyant; (the visible); *madhyama* (the mean); and *Vaikhar* (the explier. The three legs can easily be equated with the thre stages of consciousness-*Jagriti* (awakening), *Swapna (dreaming* and *Susupti* (Sound sleep) which are again identified with th three parts or components - akara, ukara, and makara of th sacred syllable 'Om'. The two heads can be the mortal and th immortal, tempord and the eternal, the terristrial and the cele

tial, the visible and the invisible. as human body is an adm
mixture of both,........The seven hands can be the five s
coupled with mind (*manas*) and consciousness (*bud*
The three qualities, *Satva*, *rajas*, and *tamas* can provide a
for the three tier system" [Dr. I. P. Rao, IJDL. XIII]

(దీన్ని మరో రకంగా వ్యాఖ్యానించడానికి అవకాశం ఉ
నాలుగు కొమ్ములు - పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరులనే నాల్గు
వాక్కులు కావచ్చు. మూడు కాళ్ళు చైతన్యంలోని జాగృత్, స్వ
సుషుప్త్యవస్థలు ఓంకారంలోని అకార, ఉకార మకారాలుకూడా కా
మృతామృత, నిత్యానిత్య, భౌమ, దివ్య, దృశ్యాదృశ్య ద్వంద్వ
ఆ రెండు తలలు. మానవ దేహంలో ఈ ద్వంద్వాత్మకత అత్యద్భు
కలిసి ఉంది. ఏడు చేతులనబడేవి పంచేంద్రియాలు, మనోబు
మూడు బంధాలు-సత్త్వరజస్తమోగుణాలు)

మరో దార్శనికుడు ఈ అర్థ కక్ష్యల్ని మరింత విస్తరించి
వచ్చునంటున్నాడు.

"చత్వారి శృంగా - పురుషార్థ చతుష్టయం, రెండు తలలు
వ్యక్తాలు, మూడు పాదాలు - త్రిలోకాలు, ఇలా వైదికార్థం చెబితే
కక్ష్యల్లోకి పోతున్నది విషయం"

[వ్యంజన సూత్రపీఠిక "చత్వారివాక్, కుమారభారతి

ఇలా చతుర్విధాలుగా విభక్తమైన "వాక్" తత్త్వం అనంత
నుంచీ అనేక రకాలుగా వ్యాఖ్యానింపబడుతూనే ఉంది".

*ఏకం సత్ విప్రా బహుధావదంతి"*

అని వేదం అందుకే కీర్తించింది. ఉన్నది ఒకటే. కాని పండితులు
విధాలుగా చెబుతారు.

—(o)—

అధ్యాయం V

# గవేషణ

*ఉపహ్వాయే సుదుఘాం ధేనుమేతాం*
*సుహస్తో గోధుకత దోహదేనాం*

[ఋక్కు 1-22-164-26]

గురువు శిష్యుడితో చెబుతున్నాడు. "గోదోహన వేళఅయింది. అడవికి మేతకు వెళ్ళిన ఆవులు తిరిగిరాలేదు. పాలుపితికి యజ్ఞకార్యానికి వాడుకోవాలి. వెళ్ళి ఆవుల్ని మళ్ళించుకు రమ్మని గురువు అంటున్నాడు.

వేదవిద్యఅంతా ఒక మహాగవేషణ (గో+ఈషణ – ఆవుల్ని వెదకటమని).

*గోదోహేన గాముప శిక్షా సఖాయం*
*ప్రబోధయ జరితర్జార మింద్రమ్*

[ఋక్కు 10-42-2]

[ఆ ఇంద్రుడిని నిద్రలేపు, ఆ ఇంద్రుడు జలితుడు. జారుడు. పాలు పిండించాలి.—ఈ సందర్భం వృత్రాసుర సంహారానికి సంబంధించిందని ఆచార్య విశ్వబంధు మహాశయుని వివరణం]

భారతకథలో (సభాపర్వంలో) ఇంద్రతనయుడు విప్రునిగోవుల్ని తోలుకుని తెచ్చి ఇచ్చాడు. విరాటపర్వాంతంలో కూడా మరలా గోవుల్ని మళ్ళించటం ఉంది. ఈ ఆవులను ఎవరు మళ్ళించగలరో వాడే అర్జునుడయ్యాడు. విజయుడయ్యాడు.

విప్రుని గోవుల్ని ఒక గంధర్వుడపహరించాడు. అర్జునుడుబాణాలు ప్రయోగించి ఆ ఆవును రప్పించాడు. వృత్రుడు మేఘాలను ఆక్రమించాడు. ఇంద్రుడు వజ్రాన్ని ప్రయోగించి వృత్రుగ్ని సంహరించి వర్షం తెప్పించాడు. ఆ ఆవు (గోవు), ఈ వర్షం (వర్షగాత్ వృషభః) రెండు వైదిక సంకేతవిద్యలో "వాక్" తత్త్వానికి నిరూపకమైన ప్రతీకలే.

అందుకే వాక్కు 'ధేనువు' అనే ఋగ్వేద మంత్రానికి అర్థ
తెలుసుకోవాలంటే మొత్తం భారతీయ జీవనంలోని 'మాతృత్వ' ప్రా
న్యాన్ని అర్థంచేసుకోవాల్సి ఉంటుంది. తల్లి తన స్తన్యాన్ని ఇచ్చి
శిశువుల్ని ఎలా పోషిస్తుందో భారతీయ జీవనంలో సర్వయజ్ఞప్రక్రియ
గోక్షీరం-తద్వారా వచ్చే పెరుగు, నెయ్యి-వీటిమీద ఆధారపడి ఉన్నా
ఆవుపేడ, మూత్రాలుకూడా 'శుద్ధి' కోసం అవసర సామగ్రి అయ్యా
కనుక "గోవు" సర్వవ్యక్త ప్రకృతికీ సంకేతంగా గ్రహించబడిం
ఇది సాకారమైన అర్థతత్త్వం. [కుమారభారతి VI

సరస్వతి అనే గోవు తన అంతస్తత్త్వాన్ని కని కుమారుడి కో
తనంతట తాను స్రవిస్తోంది. ఈ స్రవనక్రియ శబ్దానికి ఉన్న సహజం
ఉన్న శక్తి. శబ్దంతోపాటు అర్థమూ సాకారంగా స్రవిస్తోంది.

ఈ కారణంగానే మహాభాష్యకారుడు

"ఏకః శబ్దః సుష్టు ప్రయుక్తః శాస్త్రాన్వితః స్వర్గేలోకే కామధు
భవతి" [మహాభాష్య 1-1-1]

సుష్టుగా ప్రయోగించబడిన శాస్త్రాన్వితమైన ఒక శబ్దమైనా
స్వర్గలోకంలో కోరినవరాల్ని అందిస్తుంది. వక్త కామధుక్కు అవుతా
కామధేనువు వరం పొందినవాడే 'కామధుక్కు" అంచేత "గో" శ
తాత్పర్యంలో "వాక్కు" అవుతుంది.

"ధేను" శబ్దానికి కూడా "వాగర్థ" ప్రతిపత్తి ఉంది- సుర్ధయ
ఇతి ధేనుః-ధీ=పొలుగుడుచు అని అర్థం- ధేనా-దంష్ట్రా ఉపజిహ్వాణ
శబ్దాలకు ఈ అర్థంలో అన్వయముంది. భాషమనే క్షీరం తాగటా
"పదం" లేదా "శబ్దం" (వాక్కు) పాత్ర కాబట్టి—"ధేను" శబ్దంకు
పరమార్థంలో "బోధిస్తోంది (ఆచార్య విశ్వబంధు నిరూపణమిది)

"గో" శబ్దానికి "కిరణ" మనే అర్థాన్నికూడా వైదిక పండిత
నిర్ధారించారు. వైతరణి దాటడానికి గోవు "తోక" సాధనమని పు
ప్రవచనం. ఈ వైతకరణి అంధతకుసావృతమైన గృహా. ఆవు

ఆచీకటిలో దారిచూపే "కిరణం"—అదే నేటి ని "ఉపజిహ్వ" (కొండ
నాలుక . స్వర్గానికి వెళ్ళేవారికి దారిచూపే ఆ తోకే; జీవితత్వానేవ్వ
ణకు కొండనాలుక (లంబిక) ను లోపలికి మడిచిచేసే లంబికాయోగంగా
యోగసంప్రదాయంలో స్థిరపడింది. అంచేత గోవు "కిరణ' సాదృశ్యం
పొంది గుహాగతమైన "వాక్కు" కు ప్రతీక అవుతోంది (అందుకే "నిత్య"
శబ్దమని ముందు చెప్పటం).

అందుకే నిత్యమైన బ్రహ్మతత్త్వాన్ని అనిత్యమైన శబ్దాన్ని
"గోవు" అనే అద్భుతమైన ప్రతీకద్వారా వైదిక వాఙ్మయం సాధించింది
ఆవు క్షీరాన్ని వర్షించినట్టుగానే వరుణుడు జలాన్ని వర్షిస్తాడు. కాబట్టి
"వరుణుడు" కూడా వృషభ దేవునికి మారుగా మరోచోట చెప్పబడ్డాడు.

*సుదేవో అసి వరుణ యస్యతే సప్తసింధవః*
*అనుక్షరంతి కాకుదం సూర్మ్యం సుషిరామివ.*

[ఋ. సం. 8-61-12]

వరుణునికి సప్త సముద్రాలున్నట్టుగానే తాలుదేశంలో విచ్చిన్న
మవుతున్న సప్తవిభక్తులు శరీరమలాన్ని—అగ్ని విగ్రహాన్ని శుభ్రం
చేసినట్టుగా పవిత్రం చేస్తున్నాయి.]

మహాభాష్యాన్ని అనుసరిస్తూ ఉద్ద్యోతకారుడు పై ఋగ్వేద
మంత్రంలో శబ్దోత్పత్తి దేహమనోజాడ్యరూపమైన కల్మషాన్ని ఎలా
కడిగివేస్తోందో ఇలా చెప్పాడు.

"వరుణేయథా—సత్యేనదీవ్యతి ద్యోతత ఇతి యౌగికోఽయం
శబ్దస్తత్స్థానేశ్వషత్యర్థః—కామదం—తాలుప్రాప్య సప్తసింధవః—
సప్తసముద్రరూపాః—సప్తవిభక్తయోఽనుక్షరంతి- ప్రకాశంతేఽత్యర్థః
సూర్మిం—శోభనామయః ప్రతిమాం—సుషిరాం— ఉపసుపి — ఇతి
రథ్రత్యయేన సచ్ఛిద్రాం—ప్రవిశ్యాగ్నిర్యథా తత్రత్యం మలం భస్మీ
కృత్య ప్రతిమాం శుద్ధాం కరోతి—ఏవం తాలుదేశే ప్రకాశం ప్రాప్య—
విభక్తయః—విభక్త్యంతాః శబ్దాః శరీరం పాపమపా కుర్వంతీత్యర్థః
అనేన స్వర్గప్రాప్తిః ఫలమిత్యుక్తమ్" [1-1-1 క్రింద]

[వరుణునికి సప్తసింధువుల్లాగా- తాలు దేశాన్ని ఆశ్రయించి సప్త వి క్తులు - ప్రకాశిస్తున్నాయని అర్థం. శోభాయమానమైన ప్రతిమను ఆయా మూలల్లోని రంధ్రాలలోకి ప్రవేశించి అగ్ని ఎలా అందుపేరుకొన మలినాన్ని భస్మీపటలం చేసి ప్రతిమను శుభ్రపరుస్తుందో-అలాగే తా దేశాన వ్యక్తమై విభక్త్యంతాలైన శబ్దాలు శరీరంలో పేరుకొని పాపాల పోనాడతాయనిఅర్థం. దీనిచేత స్వర్గప్రాప్తి సూచింపబడుతోంది సంస్ తంలో శబ్దం విభక్త్యంతమైతే సుష్ఠుశబ్దం అవుతుంది, సుష్ఠుశబ్దం స్ ప్రాప్తిని కల్గిస్తుంది. - ఇలా చెప్పారు]

ఆమహాదేవుడే ఇక్కడ చెప్పబడుతున్న వరుణుడు సప్త సముద్ర లను జలాన్ని వరుణుడే ఇస్తున్నాడు అంతటా జల స్ప్రహను కల్గిస్ ప్రకాశిస్తున్నాడు. ప్రతిమను అగ్ని శుద్ధంచేసినట్టుగా; విభక్త్యంతాలై శబ్దాలు (సుష్ఠుగా ప్రయుక్తాలైన శబ్దాలు) తాలు దేశంలో చేరి ప్ర శించి-ఉచ్చరింపబడి- శరీరంలోని పాపాలను తొలగిస్తాయి. దీని స్వర్గప్రాప్తిసూచింపబడుతోందని అర్థం. ఇదే "కామధుక్కు" కావటవ ముందు చెప్పింది.

సవిత (సూర్యుడు) కూడా శబ్దశక్తికి అధిదైవతమే. గాయ మంత్రంగా చెప్పబడ్డది- సూర్యస్తుతే. స్తుతించేవాడిని (గాయంత్ర రక్షిస్తుంది (త్రాయతి) - అందుచేత గాయత్రి అయింది. గాయత్రి ఉంటుంది.

ఓం భూర్భువస్వః ఓం తత్సవితుర్వరేణ్యం
భర్గోదేవస్య ధీమహి - ధియోయోనః ప్రచోదయాత్
[ఋక్కు 3-62-10]

[భూః, భువః, స్వః-అన్నవి మూడూ ప్రణవ రూపాలే-అలాంటి ఓం రూపుడైన శ్రేష్ఠుడైన సూర్యనారాయణుని ఏ దివ్యప్రకాశం మమ్మ ప్రచోదింపచేయాలో, దాన్ని మేము ధ్యానిస్తాం. ఇది సాంప్రదాయికార్థ

సవితృ శబ్దంమీద చాలా చర్చకు అవకాశం ఉంది. సావిత్రి స వంతుని భార్య. సత్యవంతుడు మృతిపొందగా, సావిత్రి మరలా ప్ర

కించుకొన్నది. దీన్నే ప్రచోదనమని గాయత్రీమంత్రం చెబుతున్నది మహాదేవుడు గుహాగతుడు కావటమే మృతి. దాన్ని గాయత్రి త్రిలోద కాలుగా చెబుతోంది. ప్రణవనాదరూపమైన (ఓం) సవితృశక్తి (సూర్య శక్తి ఆ చీకటిని పటాపంచలు చేస్తోంది. ఈ గాయత్రి-ప్రకాశరూపమైన దేవీ శక్తి అని కొందరు దార్శనికులు చెప్పారుకూడా.

ఏమయినా ఎవరి ప్రచోదన చేస్తే ధీమంతులకు జ్ఞాన ప్రదీప్తి కలుగుతుందో, ఆ శక్తిని గాయత్రి అన్నారు. ఆ ప్రచోదన "శబ్ద"రూప మైందే. సరస్వతీ సూక్తంలో మిత్రావరుణుల్ని నేనే భరిస్తున్నానని దేవి చెప్పిన మాటలకు అర్థం ఇదే.

ఈ ప్రచోదన సృష్టిలోని జీవరాసులన్నిటిలోనూ ఏదో ఒక దశలో ఉంటుంది. ఆ అర్థంలో నే వాక్కు విశ్వమని అనటం. అసలు వాగ్దేవి మాట్లాడుతుండగా సర్వప్రాణులు అనువదిస్తున్నారనికూడా కౌషీతకీ బ్రాహ్మణోపనిషత్తు సిద్ధాంతీకరించింది.

"వాచం వదంతీం సర్వే ప్రాణ అనువదంతి" (కౌ. బ్రా. ఉ. 3.2) దేవతలు, మనుష్యులు, జంతువులు అందరూ వాక్కు చేతనే ఉద్దీప్తులు అవుతున్నారని కూడా ఇందుకే చెప్పారు. (ఋక్కు 8-3-6)

వేదంలో వాక్ ప్రచేతనమున్న శబ్దాలు 57 ఉన్నాయని యస్కా చార్యుడు గుర్తించాడు. [ఏకురితి సప్తపంచాశత్ వాఙ్నామాని 1-11]

అదితి, అద్ధాతి, ఇళా, ఋభు, జరితృ, జిహ్వా, ధమని, ధణ, ధీర దేను, ధిషణా, ధేనా, పవీ, బెకురా, భారతీ, మతి, మంద్రా, మహీ మాయు, మేధావీ, మేనా, మేళి, రుద్ర, రేభి, వల్గు, వాక్, వణ, వాణీ వాసీ, విశ్వ, విధాతా, విప, విపన్య, విపశ్చిత, విపా, విప్ర, వేద, వేన హోత్రా (నిఘంటు 1-2-3-15-16)

ఇంకా కొన్ని రూపాలను ఆచార్య విశ్వబంధు మహాశయుడు గుర్తించి ఉన్నాడు. బిభర్తిః (భృ= మాట్లాడు)

భరామ్యం గూషమ్ (ఋ 1-61.2)

ఉపస్తుతిం భరమాణస్యకారోః (ఋ 1-148-2)

వియద్ వాచం కీస్తాసోభరంతే (ఋ 6 67-10)

విస్పష్టధేనా భరతే....ఇంద్రం జోహువతీ మనీషా (ఋ 7-24

కారిష్ బిభ్రత (ఋ 9-14-1)

తేహి ప్రజాయా అభరంత విశ్రవో (ఋ 9-92-10)

శ్లోకం ఘోరం భరతేంద్రాయ (ఋ 9 94-1)

ఇప్పుడు "భారత" శబ్దానికి "విద్య" అనేఅర్థం స్థిరపడత (చూ. భరత. భారతి శబ్దాలు) ఆదినుంచి యుద్ధపర్వాలవరకు అవి శాంతినుంచి స్వర్గారోహణందాకా విద్య-కనుకే పాండవులు - కౌర అందరూ పార్థివమైన ఈ శరీరాలు వదలి అమృతమైన తేజోరూపా ఓంలో భారతకథ పూర్తి అవుతుంది. మహత్ (ప్రకృతి) దశన బృహత్ (ఆత్మ) దశకు చేసిన మహాప్రస్థానం కాబట్టి "మహాభార అనే పేరువచ్చిందని దధని మహాశయుని నిరూపణం విద్యను ధరిస్తె కాబట్టి శబ్దం 'భరత' మవుతోంది. అందుకే పైన చూపిన వేద ప్ర గాల్లో "మాట్లాడటం" అనేఅర్థం సమన్వయం పొందుతోంది.

పాణినీయధాతుపాఠం *భృ -ధాతువును గుర్తించలేదుకాని ప్ర గించింది (పా ధా 9-19) *భత్, *భర్త్ (పా. ధా 1-496-497) *బ (పా. ధా 10-149) లను శాపనార్థాలుగాను, పరిభాషణార్థాలుగా బడ్డాయి. వీటన్నిటిలోనూ మౌలికంగా ఉన్నది. వాగర్థమే. వీటిమ ధాతువు *భృ వచ్యర్థంలో *బృథ్ (*వృథ్) అనే మరోధాతువుక కనిపిస్తోంది.

ఈకింది ధాతురూపాలన్నీ 'బృథ్' నుంచి ఏర్పడినవిగా గు వచ్చు.

అర్ఘ్, అర్జ్, అణ్, అమ్, అమ్బ, అంబే, జర్చ, జర్జ్, జ జర్త్స, జి, జిన్వ, జుజ్చ, జృ (జర్), జలిః, తర్క, తడ్, తిక్, తుస్, తుజ్, త్రంస్ త్రప్, దత్, దంస్, దంశ్, దిల్, దిశ్, దుంద

ద్రేక్, ధణ్, ధణ్ణ్, ధమ్, ధిష్, దూప్, ధ్మా, ధ్రణ్, ధ్విన్, ధ్రేక్, ధ్వణ్ నట్, నద్, నమ్, నర్ద్, నత్, నాస్, (*ఫ) పట్, పఠ్, పణ్, పన్, పర్ద్ పిమ్స్, పిట్, పిఞ్జ్, పుట్, పుంటు, వుర్ ప్రృఞ్జ్, బణ్, బర్హ్, బల్హ్, బుక్క్ బృఙ్హ్, బృహ్, బ్రణ్, బ్రూ, భఞ్జ్, భటు భణ్ భండ్ భల్ భల్ల్ భృంశ్ భ్రిణ్ మహ్ (*భృ)

---

ఇంకా క్రింది రూపాలుకూడా వాచ్యర్థ బోధకాలుగానే వేదాల్లో కనిపిస్తున్నాయి.

మణ్ మర్చ్ మర్హ్ మార్జ్ మిజ్జ్ మిశ్ మీ మీమ్ ముజ్ ముఞ్జ్ మ్లేచ్ఛ రంఘ్ రమ్ రట్ రత్ రణ్ రమ్బ్ రమ్భ్ రిఫ్ రిః రాస్ రాశ్ రు రుమ్స్ రుట్ రుఠ్ రేట్ రేభ్ రేష్ రై లంఫ్ లజ్జీ లండ్ లంచ్ లంభ్ లింజ్ లుంజ లుప్ లోక్ లోచ్ వచ్ వట్ వఞ్ వద్ వన్ వర్ణ్ వర్హ్ వల్ వల్క్ వల్హ్ వాన్ వాశ్ విచ్ఛ్ విట్ విన్ విథ్ పద పర తల్ యల్ బ్రహ్మణ్ మేధా పర్ణ వ్రత వార్తా వార్తికా విప్ర వృత్తి.

---

ఈధాతువులమీదనే ఒక ప్రత్యేక గ్రంథంరాయడానికి అవకాశ ముంది ముఖ్యంగా అంచ్ తర్క్ నట్ పఠ్ బృంహ్ బ్రూ భణ్ రట్ రంభ్ రేట్ లోక్ లోచ్ వచ్ పణ్ వద్ వర్ణ్ విద్ పద పర బ్రహ్మణ్ వార్తా విప్ర వృత్తి శబ్దాలను మనం వాఙ్మయంలో కూడావిస్తృతంగానే ప్రయోగిస్తున్నాం. (చెప్పు, తర్కించు, (పాడించు) నటించు పఠించు బృంహణం బ్రూతే భణతి రటతి ఆరంభ రేచతి లోకం ఆలోచన వచన వాణి వదతి వర్ణయతి వర్ణః విదుః (వేద) పద (పాద) బ్రాహ్మణ వార్తా విప్ర వృత్తి)

ఒక ఉదాహరణం చూద్దాం. విప్ర శబ్దం విధ + పర అన్న రెండు శబ్దాల సమ్మేళనంతో ఏర్పడింది. సూక్తాలు పఠించేవాడని విశ్వబంధు అర్థవివరణ ఇచ్చాడు. వృణ్-చెప్పడం; వృత్తి-అవృత్తి, వార్త, అన్నీ వృణ్ ధాతువుతో ముడిపడింది. ఇలాగే తక్కిన ధాతువులలోనూ వచ్యర్థం సమన్వితం కావటం ఆశ్చర్యం కలిగిస్తుంది.

కేవలం "ఇ" అన్న ధాతువుకకూడా "మాట్లాడు" అన్నఅర్థంఉం (చూ, ఈలిత=చెప్పబడిన) పాణిని ధాతువుగా ఇ-కారాన్ని గుర్తించలే (చూ. అష్టాధ్యాయి 3-3-38) ఋగ్వేద మంత్రంలో 'పరియంతి' అన క్రియారూపానికి "సూచించు" అనే అనే అర్థముంది. ఇది కూడా వచ్య సంబంధే.

*యే త్రిషప్తాః పరియంతి విశ్వా రూపాణి బిభ్రతః*
*వాచస్పతిర్బలాతేషాం తన్వో అద్యదధాతుమే*
(అథర్వ 1-1-1)

బలా శబ్దానికి కూడా "అభివ్యక్తుట" అనే అర్థముంది
(చూ. తైత్తిరీయోపనిషత్ 1-2-1)

పై మంత్రార్థాన్ని విశ్వబంధు ఇలా వ్యాఖ్యానించారు.

Which (ye) according to Adharvan, in becoming expressio (బిభ్రతః) filled in threes sevens (త్రిషప్తాః) denote పరియంతి all (విశ్వా) phenomend forus రూపాణి) and for the expressions (బలా of which the poet invoked most appropriate the Lord of speech వాచస్పతి). Tne Vedic mind having already recognised as stated above, the universe as constituted of the name (నామన్) and the form (రూప ,Adloyurn in his invocation must have been thinking of the entirily of the name నామన్) which alone could denotationely comprhend the entiril of phenomend form (రూప) but which probably, to enhance the poetic efffect, he prefered to introduce most familiar numerical groupings, to wit triplets and septets" [Vedic Textro Linguistic Analysis P. 67-69]

("అధర్వణ వేదాన్ని అనుసరించి 'ఇ' కారం మూడింట, ఏడింట నిండి, అన్నిటినీ భరిస్తున్నది. విశ్వంలోని అన్ని రూపాలను సూచిస్తూఉన్నది. ఓ వాచస్పతీ ! ఆ మాటలను మాకు నీవు ప్రసాదించు." అని ప్రార్థిస్తున్న ఋషికి ఈ జగత్తు నామరూపాత్మకమని తెలుసు. ఇక్కడ ఋషి కావాలని కోరుకుంటున్నది సర్వ నామ, రూప వైవిధ్యాన్ని దర్శించే శక్తిని ఆ సర్వత్వానికి (అనంతత్వానికి సంకేతాలు మూడూ, ఏడూ.)

I a) విష్ణుః త్రిర్విక్రమతే....వాచమ్ [అ.బ్రా. 6-15]

b) త్రియా వృద్ వై వాక్ [తాండ్య.బా.10-4-8-9]

II సప్తధా వై వాగవదత్ [అ.బ్రా. 2-17]

త్రిషప్తాః :— [మూడులు ఏడులు] అన్న వైదికమైన పలుకుబడిని ఏమని వ్యాఖ్యానించుకోవాలి ? ఇది చెలితేనే పై మంత్రం అర్థవంతమవుతుంది.

పురుష సూక్తంలో కూడా 3 + 7 ప్రసక్తి ఉంది.

I త్రిపా దూర్ధ్వ ఉదైత్ పురుషః- పాదో స్యేహా భవత్ పునః.

II త్రిస్సప్త సమిధ కృతాః

పాణిని [అష్టాధ్యాయి 2-2-25] త్రిసప్త [మూడులు, ఏడులు గలవాడు] మనే రూపం బహువ్రీహి సమాసం. త్రిసప్తప్రతః అని [మూడు ఏడులతో కూడుకొన్నవాడు] తత్పురుష సమాసంగా గ్రహించడం మంచిదంటారు విశ్వబంధు. ఎలా గ్రహించినా త్రిసప్త దేవతా సూచక సంఖ్య అన్నది తొలుత గుర్తించాలి.

సాయణుని ప్రకారం మూడు, ఏడు దేవతల్ని సూచిస్తాయి, ఆరోగ భ్రాజ, పటర, పతంగ, స్వర్ణస, జ్యోతిషీమత్, విభాస—అన్న ఈ ఏడు నామాలు దేవతాసూచనాలు దైవవిభూతిని ఈపేర్లు సూచిస్తాయి. (చూ. తైత్తిరీయారణ్యకం 1-7-1). సప్త ఋత్విజులున్నారు — హోతృ మిత్రావరుణ అచ్ఛావాక్ గ్రావస్తుత్ బ్రాహ్మణాచ్ఛంసిన్ అగ్నిధ్ర పోతృ అన్న ఏడుగురూ ఋత్విజులు. సప్తాదిత్యులున్నారు.— మిత్ర వరుణ ధాతృ ఆర్యమన్ అంశ భగ ఇంద్రులు ఏడుగురు సప్తసంఖ్యగల ఆదిత్యులు [తై.ఆ 1-1-3-3]. ఇలాగే సప్తసింధువులు సప్తలోకాలు సప్త దిశలు [తై. బ్రా2-8-3-8] సప్తగ్రహాలు సప్తర్షులు సప్తమరుద్గణలు కూడా ఈ "సప్త" క్రింద చేరుతారు.

విష్ణువు త్రివిక్రమ క్రమంలో వ్యాప్తి చెందారు. [భూనభో రెండు-పాతాళం ఒకటి వెరసి మూడు] వాక్కు: త్రివిధ[పశ్యంతిమ వైఖరి] అని వ్యాకరణమతం [వారు పరమ గుర్తించలేదు.] స అని [బ్రాహ్మిత్యాదిరూపాలు] కూడా గుర్తించబడింది. అంద బిభ్రతి, పరియంతి, ఇలా ఇత్యాది *బృధ్ ధాతుజన్యరూపాలు వ లేనని అచార్య విశ్వబంధు మహాశయుడు గుర్తించాడు.

ఇంతేకాదు కుణ [కోణ] [చూ.కుంత] స్కంధ క్రింద-ఆద ధంద స్పంద విచ్ఛ [విచ్ఛిత్తి] ఉచ్ఛంత్ ఇత్యాది రూపాలన్నిటి మౌలికార్థం వచ్యర్థమే ఉందని పరిశీలిస్తే తెలుస్తుంది. [చూ. క భారతి పిరిక]

"ఉచ్చరత్" అన్న రూపంకూడా ఇలాంటిదే

తచ్చక్షుర్ దేవహితం శుక్రముచ్చరత్
పశ్యేమ శరదశ్శతంజీవేమ శరదశ్శతమ్
(ఋ. 7-66-16]

[దేవతలకు కాంతిని ప్రసాదించే ఆకన్ను ఉదయించు మనం వంద సంవత్సరాలు చూద్దాముగాక! వందేళ్ళు బ్రతుకుదాముగాక !]

యజుర్వేదపాఠంలో ఊనికమారి ఉచ్చరత్ అని అయింది ణాదులు ఈ ఊనికను గుర్తించలేదు. ఇలా గుర్తించక పోవట ఎంతో అర్థవైశిష్ట్యాన్ని గుర్తించలేకపోయాం ఋగ్వేదంలో ఉచ అన్నపుడు తొలిఅచ్చుమీద ఊనికలేదు. యజుర్వేదంలో ఉచ అన్నపుడు తొలి అచ్చుమీద ఊనిక వచ్చింది. చకారం మీది ఆ కంటిని చూడటంలో ఉన్న అనుభవ గాఢతను సూచిస్తుంది మీది ఊనిక ఆగాఢతను తొలిగించి మంత్రయజ్ఞం వైపు శ్రోతను పిస్తోంది. ఉత + చరత్ అంటే పైకిచరించటమని అర్థం. హృదయ భావం పైకి చరించడమే మాట్లాడటం. ఋగ్వేదంలో అది చ యజ్ఞం కాగా; యజుర్వేదంలో మంత్రోచ్చారణ యజ్ఞం అయి

ఇలా స్థిరపడిందే ఉచ్చరత్-అంటే ఉచ్చరిస్తూ అనే అర్థం - (తెలుగులో పలకటమనే అర్థమే స్థిరపడటం గమనించవచ్చు) సంస్కృతిలో కాల క్రమంలో వచ్చిన పరిణామంచేతనే ఈ ఊనిక మార్పుడిజరిగి అర్థ చ్ఛాయ మారిందని విశ్వబంధు సూత్రించాడు.

చివరిగా "రాధ" శబ్దాన్ని గమనిద్దాం. జయదేవాష్టపదుల్లో రాధా కృష్ణులే ప్రధానపాత్రలు రాధాశబ్దానికి "పాటపాడు" అనేఅర్థంఉండటం అందులోనూ వేద వాఙ్మయంలో ఈ ప్రయోగాలు కనిపించటం నిజానికి ఆశ్చర్యం కలిగించే విషయం. అంటే రాధా శబ్దానికి వెనుకకూడా వైదిక సంస్కృతి ఉందని అర్థం

> అరాధి హోతా స్వర్ నిషత్తః (ఋ. 1-70-4)
> కారాధాత్ హోత్రా అశ్వినావమ్ (ఋ. 1-120-1)
> కథారాధామ శరస్య ఉపస్తుతిమ్ (ఋ. 8-70-3)
> అరాధిహోతా నిషాదయుజీయాన్ [ఋ. 10-5-3-2]
> కోరః స్తోమం రాధతి యుంజుజోషధః [ఋ. 10-64--6]

ఇన్నిచోట్లా పాడు, స్తుతించు కీర్తించు అనే అర్థాలే సరిపోతాయని ఆచార్య విశ్వబంధు గారు గుర్తించారు. ఇపుడీ వేదమంత్రం చూద్దాం.

> కథం రాధామ సఖాయః
> స్తోమం మిత్ర స్యార్యమ్ణః
> మణిప్సరో వరుణస్య [ఋ 3-42-7-9]

> How O! Comrades may we sing
> A Song of praise and worship of
> Varuna Mitra and Aryaman [విశ్వబంధుగారి అను,]

[సఖులారా ! వరుణ, మిత్ర, అర్యముల పైన స్తుతిగీతాలను ఎలా పాడుదాం]

అరాధన శబ్దానికి వ్యుత్పత్తి చెప్పాలంటే కేవలం "రాధ" శబ్దానికి ఇక్కడ ఉన్న స్తుతిపరమైన అర్థం తెలిస్తే తప్పా సాధ్యంకాదు. "తిరు నారాధన అని దాక్షిణాత్యులు పిలిచే దైవకైంకర్యంలో ప్రధానమైంది.

పూజాంతంలో వాడుపాడే భగవన్నామ సంకీర్తనే అరాధించు-
ధాతువును గురించి మనం చెప్పగలుగుతాం కాని అందులోని ధా
ప్రత్యయ విభాగం మనకు ఎలా తెలుస్తుంది?

ఇలా చూసినపుడు శబ్దాన్వేషణ ఒక బ్రహ్మాండమైన 'గవే
అని మనకు తెలుస్తుంది. అందులోనూ వచ్యర్థంలోనే ఇన్ని రూపాం
పర్యాయపదాలూ ఉన్నాయని తెలుసుకోవటం భారతీయనాద్ దః
ఎంతగాఢమైందో, విశాలమైందో గుర్తించడానికి తొలిమెట్టు-
కల్గించే చైతన్యపరిధినిబట్టి తమశాస్త్రపరిధిని పెంచుకోవటం ః
యులు అవలంభించిన పద్ధతి. అన్నిశాస్త్రాలను వేదానికి ఉపాంశా
భావించి సత్యదర్శనాన్ని మాత్రమే తమ ధ్యేయంగా శిరసావహిం
అందుకే అన్నిశాస్త్రాలనడుమా ఒక అద్భుతమైన సమన్వ
(Sythesis) కనిపిస్తుంది. శబ్దశాస్త్రమైన వ్యాకరణంద్వారాకూడా సా
త్త్వికమైన బ్రహ్మతత్త్వ దర్శనాన్నే అంతిమ ధ్యేయంగా గ్రహించ
భారతీయవాగ్ దర్శనంలోని వైశిష్ట్యం.

—(೦೦೦)—

# శబ్దయోగం

పూర్వాధ్యాయాల్లో వివరించినట్టు భాషలోని వక్తావ్యక్త దశలి రెండింటినీ సమన్వయించుకొని తత్త్వనిరూపణం చేయటం భారతీయు లకు సాంప్రదాయకమైన పద్ధతి. అందుకే అటు శబ్దాన్ని ఇటు అర్థాన్ని రెండిటిని సమబలంతో విశ్లేషించారు. ఈ అంశాన్ని గుర్తించిన ఓ ఆచార్యుని పలుకులు చాలా అర్థవంతాలుగా ఉన్నాయి.

" Unlike its development in the west in India, if (th Science of meaning - Semantics) arose on a different footing. I acrose as a harmonising force between senscious and Supr senserous experiences. It weither condemned the higher value nor overlooked the senserous. Its spirit was always to giv proper and balanced emphasis on both"

[R. C. Pardeya : The Problem of meaning in Indian Philosophy' 1963

[పాశ్చాత్యదేశాల్లో లాగాకాకుండా భారతదేశంలో అర్థవిచారణ భిన్న భూమిక నాధారంగా పుట్టింది. ఇంద్రియాలకు, ఇంద్రియాతీత మైన అనుభవాలనడుమ సమన్వయాన్ని సాధించటమే ప్రయోజనంగ కల్గినదిగా అర్థవిజ్ఞానం పుట్టింది. అలౌకికమైన అనుభవాలను అది నిర సించలేదు. అలాగని ఇంద్రియానుభవాల్ని అది నిర్లక్ష్యము చేయలేదు ఈరెండింటిని సమదృష్టితో సముచితదృష్టితో చూడటమే భారతీయు ప్రత్యేకత]

శబ్దం—అర్థం ఇవి రెండూ అనంతత్వాన్ని కల్గినవే, అందు శబ్దంలోని అక్షరతత్త్వం [వరించనితనం] సాధకునికి ఉపాదేయం అదే శబ్దంలో నిత్యత్వదర్శనం. ఆ అక్షరతత్త్వం విశ్వరూప - విశ్వాత్మక . విశ్వోత్తీర్ణ కాబట్టి సహస్రాక్షర తత్త్వంగా దాన్ని పిలిచాడు. విరాట్పుర షుసహస్రాక్షుడు సహస్రపాదుడు, సహస్రశీర్షుడు అయినట్టు. జగన్మాత (గౌరి) సహస్రాక్షర (గో సంబంధమైనదీ "గౌరి" కూడా)

*గౌరీర్మిమాయ సలిలాని తక్షత్యేకపదీ ద్విపదీ సాచతుష్పదీ*
*అష్టాపదీ నవపదీ బభూవిషీ సహస్రాక్షరా పరమేవ్యోమన్*

దేవీసూక్తమిది. ఈ గౌరి శబ్దబ్రహ్మాత్మిక. సలిలాల్లో పుట్టింది. ఆమెకు ఒకటి రెండు-నాలుగు-ఎనిమిది-తొమ్మిది పాదాలున్నాయి. చివరికి పరమ వ్యోమంలో సహస్రాక్షర స్వరూపిణిగా నిత్యమూదర్శనమిస్తోంది

సాయణాచార్యుల వారి భాష్యం ఈ సంఖ్యల రహస్యం చెప్పింది.

తక్షతి-తత్తద్ వాచకత్వేన నిష్పాదయంతో

ఏకపదో-అవ్యాకృతత్వేన-ఏకప్రతిష్ఠానా-ఏకస్మాత్మనా

ద్విపదో-సుప్తిజ్ భేదేన పాదద్వయపతో

చతుష్పదో-నామాఖ్యాత ఉపసర్గనిపాత భేదేన

అష్టాపదో-ఆమంత్రిత సహిత అష్టవిభక్తి భేదేన

నవపదో-సావ్యయైస్తైరష్టాభిర్నవపదో అథవాసానాభికేషు ఉరః కంఠాదిషు నవసుపదేషు భవంతో పశ్చాత్ బహువిధాభిర్వ్యక్తి ముపేయుషో సహస్రాక్షరే పరమోవ్యోమను నుత్కృష్టే హృదయకాశే మూలాధారే అనేక రూపేణవ్యాప్తా.

[ఏకపదమంటే అవ్యాకృతిశబ్దం (నిత్యశబ్దం). ద్విపదమంటే - నామక్రియారూపాలు, చతుష్పదమంటే నామాఖ్యాత ఉపసర్గనిపాత భేదకపదాలు। అష్టాపదమంటే. అష్టవిభక్తి భేదక రూపనిష్పత్తులు, నవ పదం అంటే—నాభి, ఉరః కంఠాది నవస్థానాల్లోపుట్టే నాదరూపమై, మూలాధారంనుండి హృదయాకాశందాకా అనేకరూపాలలో—నాదస్వర మూర్ఛన భేదాలతో విరాజిల్లుతున్నదని అర్థం)

ఇక శివుడు ఎలా వ్యాపించి ఉన్నాడోకూడా చెప్పే మంత్రాలు శతరుద్రీయంలో ఉన్నాయి.

*ఏకాచమే త్రిసశ్చమే పంచచమే సప్తచమే*

*నవమచమే ఏకాదశచమే త్రయోదశ చమే*

1-3-5-7-9-11-13 ఇలాచేసి సంఖ్యల ప్రాధాన్యం శివుడిలో కనిపిస్తోంది.

1-2-4-8 9—ఇలా సరిసంఖ్యల ప్రాధాన్యం గౌరిలో కనిపిస్తోంది.
చిత్రం ఏమిటంటే 1-9 సంఖ్యలు ఇరువురిలోనూ సమానం సమ-
మ తత్త్వాలుగా వీరిద్దరినీ చూడటమే ఇక్కడ ప్రధానం. శివుడు
నయనుడు, పంచముఖుడు, ఇలా శివతత్త్వాన్ని వ్యాఖ్యానించడానికి
కాశం వుంది.

నిత్యశబ్దమైన "అవ్యాకృత" స్థితిలోనూ, పునర్నవమై నిత్యనూత
ం నాదాత్మకమైన "నవమ" స్థితిలోనూ (1-9) శివ గౌరీ తత్త్వాలు
డూ ఒకటిగానే ఉన్నాయని గుర్తిస్తే ఈసంఖ్యలద్వారా ప్రాచీనులు
ష్ట రహస్యాలనే భావించారని నిస్సందేహంగా చెప్పవచ్చు.
ఈ ఇరువురికీ చెందని సంఖ్య "అ" (ఆదిషణ్ముఖుడైన సుబ్రహ్మ
ని సంఖ్య-షట్క్రమల సాధనకు సంబంధించిన యోగమార్గమది)
షు విషమ సంఖ్యలతోకూడిన సమసంఖ్య అది.

వెరసి శివ గౌరీ తత్త్వాలు ఆసహస్రాక్షర తత్త్వాన్ని సమ-విషమ
గాలలో తాకుతున్నాయి. నాదరూపంలో ఆసహస్రాక్షరస్థితి అవగమ్య
తోంది. అది కారుచీకటిలోని కాంతిరేఖ—లాగా సాధకుడికి మార్గ
శం చేస్తున్నది. ఈ నాదం ప్రణవస్వరూపమైంది. అకార ఉకార
ర సంగమం దీని స్వరూపం నాదబిందు కలాత్మకమైన ఒక
్వచనీయస్థితి. అది కామకలావిలాసం. జగత్సృష్టి స్థితి సంహార
ృత్మకమైన ఒక అద్వైతస్థితి. ఆ స్థితిని అందుకోవటమే శబ్దయోగం.

ఈ శబ్దయోగ సృష్టి వేదాలలో అంకురించి ఉపనిషత్తుల్లో మహా
మైంది. వేదాలు సృజనాత్మకంగా దర్శించిన వాక్ ప్రక్రియను
నిషత్తులు విమర్శనాత్మకంగా మీమాంస చేశాయి. అవి వేసుకున్న
్న శబ్ద సృష్టికి మూలం ఏమిటని:

*కేనేషితం పతతి ప్రేషితం మనః*
*కేన ప్రాణః ప్రథమః ప్రైతి యుక్తః*
*కేనేషితాం వాచమిమాం వదంతి*
*చక్షుః శ్రోత్రం క ఉ దేవో యునక్తి* (కేన 1-1)

[ఎవనిచేత ఇచ్ఛగింపబడి, ప్రేరేపింపబడి మనసు వర్తిస్తోంది. ఎవ
దేహంలోకి ప్రాణం తొలిసారిగా లగింపబడుతోంది. ఎవనిచేత ఇచ్ఛ
బడి ఈ మాటలు మాట్లాడుతున్నారు. కళ్ళు, చెవులు ఎవనిచేత
పనుల్లో సంయోజింపబడుతున్నాయి.] ?

ఈ వాక్కును ఎవరి ఇచ్ఛననుసరించి మానవుడు ఉచ్చరిస్తు
డన్నది ఇక్కడి ప్రధానమైన సమస్య. సమాధానంగా యక్షరూపు
పరమేశ్వరుడి ఇచ్ఛమేరకు మానవులు మాట్లాడుతున్నారని ఉపని
తెల్పింది. ఇంద్రుడికి హైమవతి ప్రత్యక్షమై ఇంద్రియాలకు ఇంద్
మైన వాక్కుకువాక్కయిన పరమతత్త్వం ఒకటుందనిచెబుతూ మాయ
పోయింది. ఆస్థానంలో ఒకయక్షుడు ప్రత్యక్షమయ్యాడు .అని ఉపని
చెప్పిన కథ. "కేన" అంటే ఎవరిచేత అని అర్థం. అందుకే ఉపని
పేరే కేనోపనిషత్తని.

ఇంతకు మునుపు సూచించిన సహస్రాక్షర తత్త్వమే ఇక
యక్షతత్త్వంగా చెప్పబడింది ఇలా భిన్న రీతులలో వేదాలు ఎం
కీర్తించాయి అంటే ఒక పండితుడు ఇలా కారణం చెప్పాడు :

"In the vedic period we find a creative mind at wo
(R. C. Pandeya 'The problem of meaning in Indian Philosop

(వైదికయుగంలో ఒక సృజనాత్మక చైతన్యం పనిచేస్తూ ఉం
అందుకే "ఏకం సత్ విప్రాబహుధావదంది" అన్నది. ఇక్కడ "వి
శబ్దానికి వేద మంత్రాల్ని పలికినవాడనే అర్థం. అంటే మంత్ర
అని అర్థం "వాక్కు" వ్యక్తి చైతన్యంలో పుట్టేదికాదని, సామూహికవి
చైతన్యంలో పుడుతోందని వేదాలు తెల్పిన విషయం. దాన్నే ఉ
షత్తు కూడా సిద్ధాంతీకరించింది.

"The upanishadic literature elevated the position
Language or speech from a mere vehicle of expression to t
means of self - realisation. Language was not merely a mea
of communication for them, but means something deeper a
more significant from the metaplayrical point I view"

[I. K. Rao. opsir. P. 18

(ఉపనిషద్ వాఙ్మయం భాషను కేవలం అభిప్రాయ నివేదన వాహికగా కాకుండా ఇంకా ఉదాత్తమైన ఆత్మ సాక్షాత్కార సాధనంగా దర్శించింది. వారికి కేవలం భావాభివ్యక్తికాదు భాష అంతా. అదిభౌతిక దృష్టిలో చాలా లోతైనదీ, ప్రధానమైనదీ భాష.)

భాష ఆత్మ సాక్షాత్కార సాధనమని ఉపనిషద్ వేత్తలు దర్శించారన్న పై పండితాభిప్రాయం చాలా ప్రధానమైంది.

ఆత్మ సాక్షాత్కారానికి యోగం ప్రధాన మార్గం. "ఓం"కారంతో వేదం ప్రారంభమవుతుంది. వేదం అంతం కావటం కూడా "ఓం"కారంతోనే. కనుక ఓంకార సాధనమే ఆత్మ సాక్షాత్కార మార్గమని వైదికులు ప్రగాఢంగా విశ్వసించారు కఠ, ఛాందోగ్య మాండూక్యోపనిషత్తులు ప్రధానంగా ఓంకార విచారణ చేశాయి. బ్రహ్మకు ప్రత్యామ్నాయంగా పరతత్త్వంగా ఓం కారాన్ని ప్రతిపాదించాయి. ఉద్గీథ (వేదారంభ నాదంగా) వేదాంత దర్శనంలో చివరి మజిలీగా (వేదాంతేచ ప్రతిష్ఠితమ్) ఓంకార సాధన మహర్షులకు ఉపాదేయమైంది.

*ఏతద్ధ్యేవాక్షరం బ్రహ్మ ఏతద్ధ్యేవాక్షరమ్ పరం*
*ఏతద్ధ్యేవాక్షరం జ్ఞాత్వా యో యదిచ్ఛతి తస్యతత్ (కఠోపనిషత్)*

[ఈ (ఓం) అక్షరమే బ్రహ్మం. ఇదే పరతత్త్వం దీన్ని ఎరిగినవాడు ఏంకావాలనుకొంటాడో అది సిద్ధిస్తుంది.]

పతంజలి మహర్షి యోగభూమికగా ప్రణవనాదాన్ని గ్రహిస్తూ పరతత్త్వ వాచకం ఓంకారమని సిద్ధాంతం చేశాడు.

దీన్నిబట్టి వ్యాకరణ యోగ శాస్త్రాలకు పరతత్త్వాన్ని గుర్తించటంలో సమానత ఉన్నట్టుగా గుర్తించవచ్చు.

"తస్యవాచకః ప్రణవః"— "తత్" (ఆ బ్రహ్మ) వాచకమే ప్రణవం (ఓంకారం) ప్ర+నవం- మిక్కిలి కొత్తగా ఉంటుంది- ఎన్నిమార్లు ఉచ్చరించినా అది పాతబడదు- కారణం అది వాక్ప్రాణ నిత్య దాంపత్యంలో పుట్టే ధ్వని విశేషం కాబట్టి మనసు వాక్కులో, వాక్కు మనసులో

కలిసిపుట్టే ప్రణయనాదమే ప్రణవనాదం కాబట్టి అది నిత్యనూతన
సౌందర్యంతో గుబాళిస్తూ ఉంటుంది.

వాఙ్ మే మనసి ప్రతిష్ఠితా
మనో మే వాచి ప్రతిష్ఠితమ్ (ఐతరేయం-పూర్వోదాహృత

అనిత్యమైన మానవ భాషా శబ్దానికి నిత్యత్వాన్ని ఘటించే సామ
ఒక ప్రణవ మంత్రానికే ఉందంటూ ఛాందోగ్యం ఒక అద్భుత
వరుసను చూపించింది.

ఏషాం భూతానాం పృథ్వీ రసః పృథివ్యా ఆపోరసః ఆపా
ధయోరసః. ఓషధీనాం పురుషోరసః. పురుషస్య వాగ్ రసః. వాచ
రసః ఋచః సామరసః సామ్నా ఉద్గీథోరసః [ఛాందోగ్యోపని

(ఈ భూతాలకు పృథ్వి సారం - పృథివికి జలం-జలానికి ఓ
ఓషధికి పురుషుడు - పురుషునికి వాక్కు - వాక్కుకు ఋక్కు - ఋక
సామం- సామానికి ఉద్గీథం - అంటే ఓంకారం సారభూతమైంది).

దీన్ని కొంత వివరించాల్సిన అవసరం ఉంది. అన్ని భూ
భూమిలోంచి పుడతాయి. ఆ భూమి జలాలలోంచి పుట్టింది. జలాలల
ఓషధులు- ఓషధులలోంచి మనిషి- మనిషిలో వాక్కు, వాక్కులో ఋ
(మంత్రం) ఋక్కులో సామం, సామంలో ఓంకారం సారభూ
ఉన్నాయి. ఈ సార లక్షణాన్నే రసమని ఉపనిషత్తులు వ్యాఖ్యా
చాయి. "రసోవై సః" అని తైత్తిరీయం సూత్రించింది కూడా.
అంటే ప్రచేతన ధర్మమనిఅర్థం. దాన్నే పరమాత్మ అని భగవం
ఎన్నో రకాలుగా పిలుస్తారు.

భూమిలోనే ఈజీవరాసులకి చైతన్యరూపమైన ఉనికి కనిపిస్తే
అలాగే చెట్లకుకూడా. అలాగే మనిషికూడా. మనిషి చైతన్యవ
మాట్లాడుటలో ఉంది. ఆమాటల్లోని చైతన్యమంతా ఛందస్సు(మం
ఋక్కు); ఛందస్సులోని ప్రాణమంతా దాని గీతాత్మకత (సా
లోనూ ఉండగా; ఆ గీతాత్మకతకు ఏకైకమైన గమ్యం ఓంకా
కనిపిస్తుందని అర్థం.

ఆ ఓంకారంలో అ-ఉ-మ్‌లు ఉన్నాయి. ఈ మూడు వర్ణాలలో మనిషిలో త్రిగుణాలు, త్రిస్థాయిలు, సృష్టిలోని త్రిదశలు, చైతన్యం లోని త్రివిక్రమత్వం మూడూ పెనవేసుకొని ఉన్నాయి. అంచేత ఓం కారం రసానాం రసతమః (రసాలలో శ్రేష్ఠరసం) అని ఛాందోగ్యం వర్ణించింది.

ఉపనిషత్తులు ప్రతిపాదించిన ఈ ఓంకారతత్త్వం భాషాపరంగ ఇక్కడ చర్చించబడుతోంది. మనం రోజూవాడే భాష-మాట-తో ఉప తత్త్వాన్ని నిర్వచింపలేమని ఉపనిషత్తులు సిద్ధాంతం చేశాయి. కారణం ఏమిటంటే శబ్దాలన్నీ ఆ తత్త్వంలో "లయం" చెందుతాయి. అక్కడి చేరాక మరలిరావు.

'యం ప్రాప్యానివర్తంతే
తద్ధామ పరమం మమ'

[ఏ స్థానం చేరాక మరల భూమిపైకి రారో ఆ అక్షర పరబ్రహ్మ స్థానం నాది] అని భగవానుడు మోక్షస్థానాన్ని నిర్వచించినట్టుగానే శ బ్రహ్మ యొక్క అక్షరస్థానాన్ని నిర్వచించారు. "ఓం ఇత్యేకాక్షరం బ్రహ్మ" అన్నది అందుకే. అది అక్షరం (Syllable) ; అ - క్షరం (నశించినది-Indestructible).

యతో వాచోఽనివర్తంతే
అప్రాప్యమనసా సహ -తైత్తిరీయోపనిషత్తు

[అక్కడి నుంచి వాక్కు తిరిగిరాదు దాన్ని మనసుతోనూ అందుకోలేం

న తత్ర వాగ్ గచ్ఛతి (కేన 1-3)

అని కేనోపనిషత్తు ఈ సారాంశాన్నే ప్రతిపాదించింది. వైఖరీ వాక్కుకి కర్త-కర్మ-క్రియ అన్న నిబంధనలున్నాయి. వస్తుభావ వైరుధ్యమున్న శబ్దం వైఖరి. సృష్ట్యాదిలో వస్తు భావాల మధ్య అద్వైత అభిన్నత్వం ఉంది తప్ప వైరుధ్యం లేదు. ఆ అద్వైతాన్ని నిర్వచిం (వ్యక్తంచేసే) శక్తి లోకంలోని మాటకు లేదు. అందుకే "అక్కడికి శ

శ్యజాలదు" అని ఉపనిషత్తు చెబుతోంది. అలాంటి దివ్యశక్తి
శబ్దం ఓంకారం మాత్రమేనని మాండూకోపనిషత్తు సిద్ధాంతం.

త్రిణి గుహానిహితా" (ఆ మూడు వాక్కులూ గుహలో ఉన్నాయి)
ద మంత్రార్థమూ అన్నట్టు అకార ఉకార మకారాల్లో ఈ తత్త్వ
నం కనిపిస్తోంది. ఓంకారం ఎలాంటిదో మాండూక్యం ఎలా
కరించిందో చూద్దాం.

ప్రణవో హ్యపరం బ్రహ్మ ప్రణవశ్చ పరః స్మృతః
అపూర్వో౽నంతరో౽బాహ్యో౽నపరః ప్రణవో౽వ్యయః
సర్వస్య ప్రణవో హ్యాదిర్మధ్యమంతస్తథైవ చ
ఏవం హి ప్రణవం జ్ఞాత్వా వ్యశ్నుతే తదనంతరమ్

(మాండూక్యం 1-27)

) is described as unseen, transcendent, inapprehensible
able, unthinkable, indescribable, the sole assence of
ness itself, the completion of the world, even peaceful,
ful, the one unit]

ః లక్షణాలకు "ఫక్తు" వ్యతిరేకమైనది మనం నిత్యంవాడే భాష.
ంలకు స్పష్టంగా వినిపిస్తుంది. కనుక అదృశ్యం కాదు. భావానికి
ది. ఒక శబ్దానికి ఒక అర్థమనే నియమంతో కూడింది కావటంవల్ల
ం కాదు. వాక్యంలో శబ్దాల సంబంధం- వాటి అర్థాల పరిధులు
లొంగినవి కాబట్టి తర్కంతో స్థాపించదగ్గవి కాబట్టి అనూహ్యాలు
తర్కాలూ కావు. ఆలోచనకు అందని లౌకిక భావమూ లేదు. శబ్దా
వని భావమూ లేదు. కాబట్టి అది వర్ణించడానికి అసాధ్యమూ కాదు.
ం మనిషి వాడే శబ్దాలచేత నియమితమై ఉంటుంది కాబట్టి -
సమగ్రత పదార్థాశ్రితం కాబట్టి - శాంతి, ఆనందం, అఖండత
"అశాస్త్రీయ" భావాలు తప్ప భాషకు వీటితో సంబంధం లేదని
ష సాధారణంగా భాషావిజ్ఞానులు భాషా పరిశోధనకు "కోణాలు"
ుకొని భాషాతత్త్వ పరిధిని సంకుచింపచేశారు ప్రాచీన భారతీ
ఈ సంకుచిత దృష్టిలేదు. ఉండాల్సిన వైజ్ఞానిక భావవిప్లవాలు

జులలో రాలేదు. కనుకే లౌక్యభాష కేవలం అభాస (Virtual not రూపమని, నిజమైన వాక్కు మనసులో ఉదని, అదే సత్యమని ంలో దాగి ఉండటమంటే ఇదే) వారు భావించారు. ఓంకార సిద్ధాంత ర్యం ఇదే.

ఈ ఓంకారం బోధించే శత్ శబ్దం కూడా అలాంటిదే. దాని అర్థాన్ని భాషలోని ఏ పదాలచేత కూడా వివరించడానికి సాధ్యంకాదు.

I తత్త్వమసి

II Tou are that

III అది నీవు

టి వాక్యానికి రెండు మూడు వాక్యాలద్వారా అర్థం చెప్పడానికి ంత్నిస్తున్నాం. కాని ఏం చెప్పగలుగుతున్నాం? అది నువ్వు ఏమిటి? నిరర్థకవాక్యం ఇది. చెబుతున్నది ఎవరు ఎవరు ? ఎవరితో. అది /ఏమి/ఎవతె/ఎవడు ? ఇదే ప్రశ్న. నీవు విషయంగాకూడా. లింగ ఏమిటి అసలు ? అందుకే పరతత్త్వ సూచకమైన వైఖరీ వాక్కు ఉపనిషత్తు ఘంటాపథంగా చెప్పింది.

ఈ ఒక వాక్యానికి మాత్రమే అర్థనిర్ణయం చేయజాలం. ఇలాంటి ్యలు వేదాలలో ఇంకామూడు ప్రసిద్ధంగా ఉన్నాయి. వీటిని మహా ్యలు (The gretest sayings) అన్నారు. వాటిని మొత్తంచూస్తేతప్ప ి వాక్యాన్ని మధ్యమ, పశ్యంతి, పరలుగా మార్చుకొని వాగ్ దర్శ చేయటమంటే ఏమిటో మనకు అవగతంకాదు. పూజ్యశ్రీ స్వామి శ్వరానందులవారి వ్యాఖ్యానం ఆధారంగా చూద్దాం.

మ మహావాక్యం

ఓం ప్రజ్ఞానం బ్రహ్మ (ఋక్‌శాఖలోని ఐతిరేయ బ్రాహ్మణంలోని క్యం.

ప్రజ్ఞానమంటే ఏమిటో తొలుత చూద్దాం, ఋగ్వేదాంతర్గతమైన రేయోపనిషద్వాక్యాన్ని ఈ క్రింది మంత్రాన్ని బట్టి తెలుసుకోవచ్చు.

*యేనేక్షతే శృణోతీదం జిఘ్రం వ్యాకరోతిచ*
*స్వాద్వస్వాదు విజానాతి తత్ప్రజ్ఞాన ముదీరితం*

[ఏజ్ఞానంచేత కళ్ళుద్వారారూపం. చెవులుద్వారాశబ్దం, ముక్కు
ద్వారా వాసన, నాలుకద్వారా ఉచ్చారణ, నాలుకద్వారా రుచిభేదం
తెలియబడుతోందో ఆ విశిష్టజ్ఞానాన్ని "ప్రజ్ఞానం" అన్నారు. అంటే
ఇన్ని జ్ఞానాలు సమాహార రూపమైన చైతన్య విశేషమని అర్థం.]

కేనోపనిషత్తు ద్వితీయఖండంలో "ప్రతిబోధ విదితం బ్రహ్మ" అని
చెప్పబడ్డది. సాక్షి-జ్ఞానం అన్నవి రెండూ ఒకేవస్తువుకున్న రెండుపేర్లు.
ఈ రెండు "బ్రహ్మను సూచిస్తాయి. కళ్ళు. చెవులు మొదలైన జ్ఞానేం
ద్రియాలు కాని పృథివి, అపస్సు. తేజస్సు, వాయురాకాశాలు మొదలైన
పంచభూతాలుకాని స్వతహాగా ప్రకాశించవు. వీటిలో "సత్తా" రూపం
జ్ఞానం ప్రవేశించి అయాక్రియల్ని గ్రహిస్తోంది. అలా ప్రవేశించు
జ్ఞానాన్నే "ప్రజ్ఞానం' అంటారు. ఇక "బ్రహ్మ" విషయం, [...]
ఇలా చెబుతోంది.

*చతుర్ముఖేంద్ర దేవేషు మనుష్యాశ్వగవాదిషు*
*చైతన్యమేకం బ్రహ్మతః ప్రజ్ఞానం బ్రహ్మమయ్యపి*

[సృష్టికర్తఅయిన బ్రహ్మలోను, స్వర్గపాలకులైన ఇంద్రాదుల
లోను, ఇతరదేవతలందును, పశుపక్ష్యాదులలోను ఉన్న చైతన్యం ఒకటే.
ఉపాధులు (ఆధారాలు) వేరైనా జ్ఞానం మాత్రం ఒకటే అది నాలో
ఉన్నది. దైవమనుష్య పశుపక్ష్యాదులలో ఉన్న చైతన్యమే నాలో
ఉంది. కాబట్టి నేనే బ్రహ్మనని తాత్పర్యం]

బ్రహ్మశబ్దాన్ని వేదం ఇలానిర్వచించింది. "బృహత్వాద్ బృం
హణత్వాద్ బ్రహ్మ-"ఏకమేవాద్వితీయం బ్రహ్మ-నేహనానాస్తికించన
గొప్పవస్తువులలో గొప్పది. సర్వవ్యాపకమైంది. కాబట్టి బ్రహ్మ మనస్సు
నామరూప ప్రపంచమంతా బ్రహ్మస్వరూపమే (ఈ అర్థంలోనే బ్రహ్మ
సృష్టికర్త అనే పౌరాణిక కల్పనం]

ఇప్పుడు ప్రజ్ఞానం = బ్రహ్మ అనే మహావాక్య తాత్పర్యం సులభంగా సిద్ధిస్తుంది. సర్వవ్యాపారాలకు నిర్వహిస్తున్న విశిష్టజ్ఞానరూపమే సర్వరూపాత్మకమైన చైతన్యం దీన్ని ఆధారంగా మరో మహావాక్యం ఉంది.

ద్వితీయమహావాక్యం

"అహం బ్రహ్మాస్మి" (యజుశ్శాఖకు చెందిన బృహదారణ్యకోపనిషత్తులో ఈ వాక్యం ప్రస్తావించబడింది)

అహం = నేను అని నిఘంటువు చెబుతుంది. ఈ "నేను" ఎవరో శ్రుతి ఇలా చెబుతోంది.

*పరిపూర్ణ పరాత్మాస్మిన్ దేహే విద్యాధికారిణి*
*బుద్ధేస్సాక్షితయా స్థిత్వా స్ఫురన్నహమితీర్యతే*

(ఈ దేహంలో బ్రహ్మవిద్యకు సంపూర్ణమైన అధికారం కల్గి సర్వదేహంలోనూ నిండి బుద్ధికి సాక్షిగా ఉంటూ స్ఫురణశక్తికల్గి ఏపరాత్మ (చిత్కల) ప్రకాశిస్తోందో అదే "నేను".)

ఆత్మకు మాత్రమే బ్రహ్మ విద్యాధికారం ఉంది. దేహానికికాదు, ఇంద్రియాలకుకాదు, దానికి "స్ఫురణ" విశిష్టలక్షణం. నిత్యప్రకాశరూపమైంది. అక్కడ చీకటిలేదు. ఎప్పుడూ ప్రకాశమే. అట్టి ఇంద్రియాలకు అతీతమైన బుద్ధికికూడా సాక్షిగా ఉంటుంది. దానికి చలనంకూడాలేదు. "స్థిత్వా అంటే స్థిరంగా "నిలిచి" అని అర్థం.

ఇక ఇక్కడున్న "బ్రహ్మ" ఎవరు?

*స్వతః పూర్ణ పరాత్మాత్ర బ్రహ్మ శబ్దేన వర్ణితః*

*అస్మీత్యైక్య పరామర్శ స్తేన బ్రహ్మ భవామ్యహమ్*

(స్వతసిద్ధంగా తనకుతానుగా సంపూర్ణంగా ప్రపంచానికి లోనా, బయటా వ్యాపించిన పరమాత్మనే "బ్రహ్మ" శబ్దంచేత ఇక్కడ చెబుతున్నాం. అస్మి = అవుతున్నాను. అనే ఉత్తమ పురుషైక వచన క్రియ ఈ రెంటినీ కలుపుతోంది. అహం "బ్రహ్మమే" అన్న ఏకత్వాన్ని సూచిస్తోంది)

ఇక్కడ ఆ "అహం" చెబుతోంది. నేనే "బ్రహ్మని" అని దేహం చెబుతున్నది. జీవుడుకాదు అంటున్నది. ఏ ఆత్మ ఇంద్రియాలకు సాక్షిగా ఉంటూ కార్యకలాపాల్ని నిర్వహిస్తోందో ఆ చైతన్యం - సర్వత్రానిండిన ఆ పరమాత్మ చైతన్యాన్నే సుమా! అని ప్రకటిస్తో తృతీయ మహావాక్యం

"తత్త్వమసి" [సామవేదంలోని ఛాందోగ్యోపనిషత్తులో ఈవా చెప్పబడింది]

తత్ = అది; త్వం = నీవు; అసి = అవుతున్నావు
'తత్' అనే పదానికి అర్థం శ్రుతి ఇలా చెబుతోంది.

*ఏకమేవాద్వయం సన్నామరూప వివర్జితం*
*సృష్టేః పురాధునా ప్యస్యతా వ్యాప్త్వం తదుదీర్యతే*

(అది "సత్" పదార్థం ఒకటేఅది. అఖండమైంది. దానికి పేరు రూపమూ లేదు. సృష్టికిముందూ అదే ఉంది. సృష్టిలో లీనమై ఇప్పు సామర్థ్యరూపంలో అదే మిగిలిఉంది. ఆ "ఆత్మ"నే వేదం "బ్ర మన్నది. అదే "తత్" పదంచేత ఇక్కడ సూచింపబడింది)

"త్వం" పదానికి అర్థం చూద్దాం.

*శ్రోతుర్దేహేంద్రియాతీతం వస్త్వత్రత్వం పదోరితమ్*
*ఏకతాగ్రాహ్యతే సతి తదైక్య మను భూయతామ్*

[ఇక్కడ ఉన్న త్వం = నీవు - శిష్యుడియొక్క లేదా శ్రోతయొ దేహంకాదు. బుద్ధికూడా కాదు. వీటికి అతీతమైన సత్తరూపమైన ఏదో అదే "త్వం" పదంచేత సూచింపబడుతోంది. "అసి" అనేపదం త్వ అన్న రెండు పదాలను కలుపుతోంది. అదే నీవు అని చెప్ప తాత్పర్యం]

ఇక్కడ వక్త "గురువు" — ఆత్మజ్ఞాని సదసద్వివేకం గల శ్రోత శిష్యుడు. నామరూపరహితమైన ఆ "ఆత్మ" సద్వస్తువని, రూప సహితమైన "దేహం"తో కూడిన "నీవు" నిజానికి ఆ "ఆత్మ"వే త దేహానివి కావని గురువు నిశ్చయంగా చెబుతున్నాడు.

చతుర్థ మహావాక్యం

"అయమాత్మా బ్రహ్మ" [అధర్వణ వాక్యంలోని మండూకోపనిషత్తులోని వాక్యం ఇది]

అయమ్ = ఈ; ఆత్మా = ఆత్మ; బ్రహ్మ = బ్రహ్మమే - శ్రుతి ప్రమాణం క్రింది విధంగా ఉంది.

స్వప్రకాశా పరోక్షత్వ మయమిత్యుక్తితోమతం
అహంకారాది దేహాంతాత్ప్రత్య గాత్మేతి గీయ్యతే

[తనంతట తాను ప్రకాశిస్తూ పరోక్షంగా ఉన్న సాక్షినే "అయం" అంటున్నాం. అహంకారం నుంచి స్థూలశరీరం దాకా ఉన్న వస్తువుల కన్నా వేరుగా ఉంది కాబట్టి ఆ సాక్షినే "ప్రత్యగాత్మ" అనికూడా అంటాం]

ఇక్కడ "బ్రహ్మ" శబ్దం ఎవర్ని సూచిస్తుందో చూడండి.

దృశ్యమానస్య సర్వస్య జగత స్తత్వ మీర్యతే
బ్రహ్మశబ్దేన తద్బ్రహ్మ స్వప్రకాశాత్మ రూపకమ్

[కనిపిస్తున్న ఈ సర్వజగత్తులోని సారభూతమైన సత్తాన్ని "బ్రహ్మ" శబ్దంలో పిలుస్తారు. దాని ప్రధానధర్మం స్వప్రకాశం, అదే దాని రూపంకూడా]

ఇక్కడకూడా వక్త గురువే. మహర్షి, కాని దీనికి శ్రోత ఎవరూ లేడు, గురువు తనంతతాను చెప్పుకొంటున్న విషయమిది ఇదే ఆత్మ దర్శనమంటే నాలో ప్రత్యగాత్మగా (వేరుగా) ఉంటున్న చైతన్యం అపరబ్రహ్మ చైతన్యమే. కనుక నేను శరీరాన్ని కానన్న స్పృహేపేరే ఆత్మజ్ఞానం.

ఇలా వైఖరీరూపంలో ఉన్న శబ్దం బాహ్యఆవరణను కోల్పోయి అంతర ప్రజ్ఞారూపమైన మరోశబ్దంగా మారి ప్రకాశిస్తుంది. ఆప్రకారం మహా అర్థాన్ని వెలిగిస్తుంది. ఈ వెలుగులు మహాప్రస్థానంచేత సిద్ధించే

శబ్దార్థాల అద్వయరూపమైన "భావ" స్థితి ఒకటిలోపల శాశ్వతంగా ప్ర
శిస్తూ ఉంటుంది. దాన్నే ఆత్మజ్ఞానమని పిలిచింది. ఇలా వైఖ
లోపలికి చొచ్చుకుపోయి ఆ నిరంతర ప్రకాశాన్ని చేరుకోవడాన్నే "శ
యోగమని అంటాం. దీన్ని సాధించడానికి ఋషులు శబ్దాన్ని మంత్ర
"మననం" చేశారు. (మననాత్ మంత్రః) ఈ అర్థంలోనే శబ్దా
భారతి అని (ప్రకాశిస్తుందని) పిలవటం శబ్దానికున్న భిన్న వ్యా
కక్ష్యలద్వారా బ్రాహ్మీత్యాది నామాంతరాలు ఏర్పడ్డాయి. ఇలా భా
దేశంలో వేదోపనిషత్తులలోనే శబ్దోపాసన "జ్ఞాన" సాధనంగా
సంప్రదాయమైంది.

ఇతర శాస్త్ర మార్గాలకు కూడా ఈపద్ధతే ఉపాధేయంకూడా అయి
కారణం ఏమిటంటే భారతీయశాస్త్రాలను పండితులు, మేధావులుకాకు
మహర్షులు దర్శించటం. అన్ని శాస్త్రాలలో తలమానికమైన వ్యాకర
కూడా ఈ జ్ఞాన సాధనంగానేపుట్టిందని గుర్తించటం చాలాఆశ్చర్యా
కల్గిస్తుంది.

యజ్ఞప్రక్రియలో భాగంగా వుట్టిందే వ్యాకరణ ప్రక్రియ కూ
కర్త-అన్నమాట అటు యజ్ఞానికీ, ఇటు వాక్యానికీ సమానమే. ఇ
క్రియ-కర్మ అనే పదాలుకూడా. సూత్రం - యాజ్ఞికుడు యజ్ఞ దీ
బద్ధుడని - అధికారం కలవాడని సూచిస్తుంది. అలాగే వ్యాకరణంక
సూత్రాధికారంమీదనే ఆధారపడింది. అసలు "సూక్త" నిర్వచ
వ్యాకరణంలో సూత్రంగా మారిందనిపిస్తుంది. విద్వాంసుడంటే సూ
ద్రష్ట అనే అర్థం.

సూత్ర దర్శనం - తత్త్వ జిజ్ఞాస :-

సూత్రబద్ధంగా సత్యాన్ని నిర్వచించగలిగినవాడే విద్వాంసు
"ప్రథమేహి విద్వాంసో వైయాకరణాః — అని వ్యాకరణకారుడు ప్ర
తింపబడ్డాడు. జ్ఞానాన్ని విశ్లేషించటంలో - వ్యాకరించటంలో ప్రా
శబ్దరూపనిష్పత్తి, తద్వారా అర్థనిర్ణయం. దానివల్ల సాధుశబ్ద స
ప్రయోగ కుశలత సిద్ధిస్తుంది. దానిద్వారాకలిగేది వాక్శుద్ధి. త్రికరణ

'వాక్కు" ఒకటి. మరొకటి మనస్సు-దానికై ఏర్పడిందే యోగమార్గం. ప్రాణాపాన ఉచ్ఛ్వాసనిశ్వాసాలనుసమస్థితిలో ఉంచడం ద్వారా దేహాన్ని మనసును ఒక సమస్థితిలో ఆధానించడం అలవాటు అవుతుంది. దాన్నే సమాధి అంటారు దీనిద్వారా మనఃశుద్ధి కలుగుతుంది మూడవకరణం దేహం (కాయం)-మూలికలద్వారా, ఓషధులద్వారా, ధౌతి, నౌళి మొదలైన ప్రక్రియలద్వారా, ఉపవాస, జాగరణాది నియమాలద్వారా శరీరాన్ని రోగనిరోధకంగా మార్చి ఆయుఃప్రమాణాన్ని పెంచుకోవడం, తద్వారా "కాయశుద్ధి" కలుగుతుంది ఈ విధంగా మనోవాక్ కాయశుద్ధి, కలిగిన వాడికి శుద్ధ 'బుద్ధి' ఏర్పడుతుంది. ఆ బుద్ధికి నిర్మలినమైన చైతన్యసిద్ధి సంప్రాప్తించి "ఆత్మశుద్ధి" కలుగుతుంది. "దేహబుద్ధి" నశిస్తుంది. అదే ఆత్మజ్ఞానానికి ప్రథమ సోపానం. ఇలా ఈ మూడూ-వ్యాకరణ, ఆయుర్వేద, యోగమార్గాల పరస్పర సమన్వితంగా తీర్చి దిద్దినవారు మన ప్రాచీన మహర్షులు. పతంజలి మహర్షి అలాంటి సిద్ధ యోగి. వాక్శుద్ధికోసం అష్టాధ్యాయిని మహాభాష్యాన్ని, దేహశుద్ధికోసం "చరకసంహిత"ను సృష్టించి పాణిని మహర్షి ఋణాన్ని తీర్చుకున్న మహనీయుడాయన. ఆ మహాభాష్యానికి టీకిరించిన కాత్యాయనుడు కూడా ఈ సంప్రదాయానికి వ్యాఖ్యాతగా గురుస్థానాన్ని పొందాడు, ఈ ముప్పురినీ మునిత్రయమంటారు. వీరిచేత ప్రవర్తింపబడిన శబ్దోపాసన మార్గమే మన భారతదేశంలో వ్యాకరణ మార్గమని పేరుపొందింది.

సూత్రరూపంగా సత్య నిర్వచనం చెప్పడం ఋషుల పద్ధతి. 'తత్త్వమస్యాది వాక్యాలన్నీ సూత్రాలే. శ్రుతిస్మృతి శాస్త్రగ్రంథాలలోని వాక్యాలన్నీ సూత్రాలే. సూత్రం ఎలా ఉంటుందో సంప్రదాయంలో ఇలా నిర్వచించారు. హలాయుధ కోశకారుడు ఈ నిర్వచనాన్ని సంగ్రహించి ఉంచాడు.

*అల్పాక్షర మసందిగ్ధం సారవద్విశ్వతో ముఖమ్*
*అస్తోభ మనవద్యంచ సూత్రం సూత్రవిదోవిదుః*

[తక్కువ సంఖ్యకల అక్షరాలతోకూడింది. అసందిగ్ధంగా ఉన్నది. సారవంతంగా చెప్పగల్గింది. విశ్వతోముఖంగా ఉన్నది. అల్పంకానిది

(అవ్యాప్తిలేనిది) నింధ్యంకానిది (నిర్దుష్టమైనది) ఏదిఉందో అదేస
మని సూత్ర విదులంటారు]

సూత్రం నిడివి అధికం కాకూడదు జ్ఞానం ఎంత సమగ్ర
ఉంటే సూత్రం అంత సంక్షిప్తంగా ఉంటుంది. ఎంత స్పష్టంగా ఉ
అంత అసందిగ్ధంగా ఉంటుంది. పూర్వాపర సమన్వయం ఉంట
తత్వాన్ని సఫలవంతంగా నిర్వచించాలి—అప్పుడే అది సారవం
ఇతర శాస్త్రాలలోకూడా ఈ సూత్రానికి అన్వయం ఉండాలి—
విశ్వతో ముఖత్వం సూత్రార్థం అన్వయించని సందర్భం ఉండ
అవ్యాప్తి ఉండకూడదు—అలాగే అధికవ్యాప్తికూడా ఉండరాదని
నిర్దుష్టంగా ఉండాలి.—శబ్దార్థ వాక్యార్థ అన్వయాల్లో ఎక్కడా
ఉండకూడదు. ఇలా చెప్పబడ్డది "సూత్రం" ఈ సూత్ర నిర్వ
ఏ జ్ఞాన సూత్రానికైనా సరిపోతుంది.

అష్టాధ్యాయిలో పాణిని మహర్షి 4000 సూత్రాల్ని దర్శిం
ఈ సూత్రాలక్రమం—వాటి నడుమఉన్న అన్వయం—మానవ
అందనంత సూక్ష్మంగా ఉన్నాయి. ఆధునికయుగంలో ప్రాచ్యపాశ్చా
మేధావులలో ఎవరూ అలాంటి వ్యాకరణ నిర్మాణం చేయలేకపోయ

అలాంటి అష్టాధ్యాయిలోని మొదటిసూత్రం 'వృద్ధిరాదైచ్' (1
అన్నది చివరి సూత్రం అ-అ ఇతి (8-4-68) ఇలా ప్రారంభాం
మహర్షి సూత్రాల్ని ఎందుకు నిబంధించాడన్నది చాలా పెద్ద ప్ర
మిగిలిపోయింది. పూజ్యశ్రీ ఇలపావులూరి పాండురంగారావుగారు
సూత్రాల్ని పాణిని ఎందుకు నిబంధించాడో ఇలా చెబుతున్నారు.

"One wonders why the whole text should start wit
word 'Vruddhi' and end with a simple repetition of the sy
*a-a iti* It appears as if the whole world of words whic
gifted grammasion is trying to analyse in his work is cont
in the simple syllable 'a'. In its unmanifested (Samvrt)
it serves as a repository for all the sounds, syllables, mea
and melodies that the human speech is estable of negot
with. All this treasure becomes explicit (Vivrt) when this

manifests it self. If the Upanishdic seers found the essence of all the essence in '*Om*', Panini further summarised it and gave it the form 'a' "
[I. P. Rao. Opcit, P. 188]

పాణిని వ్యాకరణం ఇలా "వృద్ధి"తో ప్రారంభమై అ-అ ఇతి అని ఎందుకు అంతం అవుతోందన్నది ఆశ్చర్యం కల్గిస్తుంది. తాను వ్యాకరిస్తున్న సర్వ శబ్ద ప్రపంచాన్ని పాణిని "అ"కారంతో సూచిస్తున్నాడని తోస్తుంది. ఈ"అ'కారమనేఅక్షరం, సంస్కృత[అభివ్యక్తికాని] దశలో అన్ని ధ్వనులకు, అక్షరాలకు, అర్థాలకు, అర్థవిశేషాలకు ఆకారంగా ఉంటుంది ఇదే వికృతం [అభివ్యక్తం] అయితే అన్ని ధ్వనులు, శబ్దాలు, అర్థాలు బయటికి వస్తాయి. ఉపనిషత్ ద్రష్టలు "ఓం" కారంలో సారంలోని సారాంశాన్ని చూస్తే పాణిని "ఓం"కారాన్ని మరింత సంక్షిప్తంచేసి "అ"కారంగా పిలిచారని చెప్పవచ్చు]

స్థూల దృష్టికి ఈ వ్యాఖ్యానం ఒట్టి వైయుక్తికమైన "ఊహ"గా కనిపిస్తుంది. కాని ఏ ప్రయోజనాన్నీ ఆశించకుండా అందులోనూ వ్యాకరణకారుడు సూత్రం నిర్మిస్తాడా? ప్రాచీన వ్యాఖ్యాతలు కూడా ఈ సూత్రాలకు ఒక విశిష్ట ప్రయోజనం ఉందని గుర్తించే ఉన్నారు. అ.అ సూత్రానికి టీకరాస్తు వార్తికానికి వాఖ్యరాసిన 'ఉద్ద్యోత" కారుడు భర్తృహరి "వాక్యపదీయం"లో నుండి ఈ క్రింది శ్లోకాన్ని ఉదహరించాడు.

*ఇదమాద్యం పదస్థానం సిద్ధి సోపాన పర్వణామ్*
*ఇయంసా మోక్షమాణానా మజిహ్మా రాజపద్ధతిః*

[వా ప. 1.16]

[ఇది పదస్థానాలలో మొదటిది. సిద్ధిసోపానాల కణుపులలోనూ మొదటిది. మోక్షం ఆశించేవారికి నిస్సందేహంగా ఇది రాజపద్ధతి]

శబ్దవిభాగం మోక్షానికి రాజమార్గం—అన్న ఈ అభిప్రాయాన్ని నాగేశభట్టు తన వివరణంలో మరింత స్పష్టంచేశాడు

"పై సూత్రం వ్యాకరణాధ్యయనం ప్రయోజనం సకలపురుషార్థ సిద్ధి అని దర్శిస్తోంది. అంచేత ఈ సూత్రం అష్టాధ్యాయికి మంగళా

చరణం. విష్ణువాచకమైన అకారాన్ని రెండుమార్లు ఉచ్చరించటం అం
వల్లే శ్రుతి ఇలా అన్నది.

> అకారో వై సర్వా వాక్
> సైషా స్పర్శోష్మభి ర్వ్యజ్యమానా
> బహ్వీ నానారూపా భవతి [ఐతరేయారణ్యకం 2-3-4

అకారం సర్వశబ్ద ప్రకృతి కావటంచేత "అఇతి బ్రహ్మ" (పరతత్త్వ
వాచకం) అన్న అర్థంలో ఇది భగవంతుడైన పాణిని చేత దర్శింపబ
దని వార్తికకారుడు రాశాడు. పతంజలి "ఏకదేశ నిర్దేశోఽయం
అని అనటంలో ఇంత అర్థాన్ని భావించాడు.

భగవంతుడు స్వయంగా గీతలో తాను అక్షరాలలో అకారాన్ని
అని చెప్పినట్లు "విభూతియోగం"లో వ్యాసమహర్షి గ్రథనం చేశాడు.

"అక్షరాణ మకారోఽస్మి" [గీత-విభూతి]

దక్షిణదేశంలోకూడా ఈ సంప్రదాయం చిరంతనంగా వ్యా
చెందిందనటానికి క్రింది ప్రమాణం చాలు

"అగర మొదల ఎలుత్తెల్లామ్ ఆది
బగవన్ మొదట్రే ఉలగు"—తిరుక్కురళ్

[అక్షర ప్రపంచానికి అకారం మొదలైనట్టి ఈ జగత్తుకు దేవు
మొదటికర్త]

పాణినిలోనే మొదటిసారిగా ధాతు-ప్రత్యయ విశ్లేషణ కనిపిస్తో
ప్రకృతి పురుష తత్త్వాల్ని పదంలో దర్శించటంలో ఈ విభజనపుట్టిం
ప్రకృతి—ప్రాతిపదిక—ఉపసర్గ—నిపాత—అవ్యయ రూపాలను ఇ
ప్రకృతి విశ్లేషణకు అటు భాషాపరిధికి — రెండింటికీ అన్వయిం
చూడవచ్చు.

"పరస్సన్నికర్ష స్సంహితా" అని "సంహిత"ను నిర్వచించా
వర్ణాలకు అతిశయించిన సన్నిధి—సన్నిహితత్వం ఉంటే దాని
"సంహిత" అన్నారు— అప్పుడే సంధి జరుగుతుంది — అని వ్యాకరణ
చెబుతుంది. తైత్తిరీయంలో ఐదువిధాలయిన సంహితలు చెప్పబడ్డాం:

"పంచస్వధికర్ణేషు—అధిలోక మధిజ్యోతిష మధి విధ మధి ప్రజ మధ్యాంతం తామహా సంహితా ఇత్యా చక్షతే"

అధిలోకం, అధిజ్యోతిషం, అధి విధం, అది ప్రజ అని మహా సంహితలు ఐదువిధాలుగా చెప్పబడ్డాయి—ఇవి అధికర్మాలు)-తైత్తిరీయ

మరి ఒక సందర్భం —కారక చర్చ. విభక్తియొక్క అర్థాన్ని చెప్పేది కారకం. కారకాలకు అపాదానంతో మొదలు పెట్టాడు [పంచమీ విభక్తితో]—కర్తృకారకంతో పూర్తిచేశాడు (ప్రథమా విభక్తి) —ఈ విధంగా చేయటంలో జగత్ సృష్టిని వాక్యవ్యాపారాన్ని అభిన్నంగా చూసేదృష్టిఉందని శ్రీ ఇల పావులూరి పాండుసంగారావుగారు అభిప్రాయ పడుతున్నారు (opcir P 188)

ఇలాగే "కర్తృ" తత్త్వాన్ని నైయాయికులు, "కర్మ" తత్త్వాన్ని మీమాంసకులు మూల సూత్రాలుగా గ్రహించి జగద్రహస్యాన్ని విశ్లేషించడానికీ ప్రయత్నించారు. పరమేశ్వర తత్త్వాన్ని "కర్త" అని నైయాయికులు పిలిచారు. "కర్మ" అని మీమాంసకులు సంకేతించారు. "క్రియ" అనే మాట వైదిక యజ్ఞ ప్రక్రియ నుండి సృష్టివివేచనలోకి, అందులోంచి వ్యాకరణంలోకి ప్రవేశించిన పరిభాష. ఇలా వ్యాకరణం మొత్తం భాషాశోధనద్వారా సృష్టిని సంబోధించిందని అర్థం చేసుకోవచ్చు.

స్ఫోట సిద్ధాంతం-శబ్దయోగ సంస్థాపన.

భర్తృహరి తన "వాక్యపదీయంలో ప్రతిపాదించిన సిద్ధాంతం స్ఫోట సిద్ధాంతం. ఈ సిద్ధాంతం ద్వారానే శబ్దయోగం అంటేఏమిటో మనం బాగా అర్థంచేసుకోగలుగుతున్నాం. తరువాత వచ్చిన ఆలంకారిక సిద్ధాంతాలకు కూడా మూలమై వాక్ దర్శన ప్రస్థానంలో ప్రభూతమైన స్థానంగా "స్ఫోట" నిలిచిపోయింది. కనుక స్ఫోట నుగురించి అర్థం చేసుకుందాం.

స్ఫోట సిద్ధాంత మూలం శబ్దార్థ సంబంధ విచారణలో ఉంది. నైయాయికులు అనబడే తార్కికులు శబ్దం —అసగావర్ణాదులు అశాశ్వత

మైనవని, వాటికి అర్థంతో ఉన్న సంబంధంకూడా తాత్కాలికమే
అన్నారు. మీమాంసకులు అనబడే జిజ్ఞాసువులు శబ్దం-అనగా వర్ణాద
నిత్యమైనవని, వాటికి అర్థంలో శాశ్వత సంబంధం ఉందని అన్నా

వ్యాకరణజ్ఞులు ఈ రెండు అభిప్రాయాలను అంగీకరించలే
శబ్దార్థాలు అవిభాజ్యాలని వారు భావించారు. అర్థంలో అలా
భాజ్యంగా ఉన్న శబ్దాన్ని వారు "స్ఫోట" అన్నారు. శబ్దంతో
భాజ్యంగా ఉన్న అర్థాన్ని "స్ఫోట" లేదా "ప్రతిభ' అనిపిలిచారు. వా
పదాలుగా, పదాలు వర్ణాలుగా విభజించటంకూడా వైయాకరణ సం
దాయంకాదు. అలాగే పదాల అర్థాలు ఒకదానితో మరొకటికలిసి వాక్య
అవుతాయనీకూడా వారు అంగీకరించారు.

వ్యాకరణజ్ఞులు ఇలా ఎందుకు వాదించారో అర్థం చేసుకోవాల
వారి తాత్త్విక దృక్పథం అర్థం చేసుకోవాలి. పాణిని, పతంజలి వ
లైన మహర్షులు ఏ దృష్టితో శబ్ద తత్త్వవివేచన మొదలుపెట్టారో
వ్యాకరణజ్ఞులందరి ఉపాదేయమైంది. దీనిలో చివరి మెరుపు భ
హరి పాణిన్యాదుల ప్రయత్నం ఎలాంటిదో భట్టోజీదీక్షితుడు తన "
కౌస్తుభ' మనే గ్రంథంలో ఇలా చెప్పాడు.
"వరాటికాన్వేషణాయ ప్రవృత్త శ్చింతామణిం లబ్ధవాన్"
(శబ్దకౌస్తుభ

(గవ్వలు వెదకటానికి వెళ్ళినవాడికి చింతామణి దొరికింది)
అలా ఉండుట వ్యాకరణజ్ఞుల అన్వేషణ. అందుకే మహాభాష్యం
చివరికి పతంజలి శబ్దతత్త్వాన్ని, శబ్దబ్రహ్మకు స్ఫోటను—ఆధారం
ప్రపంచ సృష్టిరహస్యాన్ని కనుక్కొగలిగాడు. కాని భర్తృహరి ప
కతో దార్శనికుడు అద్వైత సంప్రదాయంలో పెరిగినవాడు. భా
తత్త్వ వివేచనకు కూడా అదేమార్గాన్ని అవలంబించాడు. అందుకే
ప్రమాణము ఉపాదేయమన్నాడు. వేదగమ్యమే భాషావివేచనంకూ
గమ్యమన్నారు. వేదం "శబ్ద' ప్రధానం కావటంవల్ల=శబ్దత
ఉపాసింపదగిందన్నారు. దేశకాలాలను అతిక్రమించిన శబ్దత
రూపమైన బ్రహ్మమే ఈ సర్వసృష్టికి మూలమని సిద్ధాంతం కూ
చేశాడు.

అనాది నిధనం బ్రహ్మ శబ్దతత్త్వం యదక్షరం
వివర్తతేఽర్థ భావేన ప్రక్రియా జగతో యతః

[శబ్దతత్త్వ స్వరూపమైన అక్షర రూపమైన ఆ బ్రహ్మతత్త్వం అనాది నిధనంలేనిది. అది ఎలా వివర్తమవుతోందో. అలాగే అర్థభావంతో శబ్దంకూడా వివర్తమవుతోంది)

అక్షర శబ్దం "అశ్' ధాతుజన్యం దీనిఅర్థం "వ్యాపించట"మని దేశకాలాలకు అతీతంగా వ్యాపించినందువల్లే అది అక్షరమైంది. క్షరము కానిదన్న అర్థం తరువాత వ్యాపించింది [న + క్షరం-అక్షరం]-అంచేత "అక్షరం" అంటే సర్వవ్యాపకమైన బ్రహ్మతత్త్వమన్న వాక్యపదియ కారుని తాత్పర్యం సంపూర్ణంగా వైదికమైన భావన. వైదిక సంప్రదాయంలో బ్రహ్మవాక్ శబ్దాలు అభేదకాలే.

"యావత్ బ్రహ్మ విష్ఠితం తావతి వాక్" (ఋ 10-114-8]

[బ్రహ్మ శబ్దం వృహ్ ధాతుజన్యం దీని అర్థం "పెరగటమని" (expanded consciousness) అని అర్థం) . ప్రత్యక్ చైతన్యం పెరిగి పెద్దదై వ్యాపించి బ్రహ్మ చైతన్యమవుతోంది. ఇది ఎలాసంభవం అంటే

"మహాదేవో మర్త్యానావివేశ" (ఋ వే. 4-58-3)
ఆ మహాదేవుడు మనిషిని ఆవేశించటంవల్ల సంభవిస్తోందని వేదం సమాధానం చెప్పింది. ఇదే ప్రక్రియ వాక్కువిషయంలోకూడా సంభవిస్తోంది సృష్టిలో వాగుత్పత్తి ఇలా ఏర్పడుతున్నదే.

తొలి దశలో అతిగుప్తంగా శబ్ద భావాలు రెండూ విడదీయరాని ఒక ఆధ్యాత్మిక చైతన్యస్థితిలో ఉంటాయి పశ్యంతి)

రెండో దశలో 'అంతస్సంజల్పం' (Internal Discuss) గా అంటే లోపలి సంభాషణలాగా శబ్ద భావాలు కలిసే ఉంటాయి.- అయినా బయటికి రావు. లోపల ఉచ్చరించటం వినిపించటం ఉంటుంది. (మధ్యమ)

మూడో దశలో వాక్కు స్పష్టంగా ఉచ్చరిస్తాం. అర్థం వేరుపడి

గ్రహించబడుతోంది. శబ్దం వాచకం అవుతుంది. ఇదే మనం మా లౌకిక వాక్కు. (వైఖరి)

అందువల్ల వాక్కు - బ్రహ్మ రెండూ ఒకటేనన్నది స్ఫోట సి తానికి వెన్నెముక. ఈ దర్శనమున్న మహర్షులు వాక్కుద్వారా బ్ర ను ఇతరులకు దర్శింపచేయటం కోసమే మంత్ర సృష్టి చేశారని వ పదీయకారుడు చెబుతున్నాడు.

*ప్రాప్త్యుపాయోనుకారశ్చ తస్యవేదో మహర్షయః*
*ఏకోఽప్యనేకవర్త్మేవ సమామ్నాతః పృథక్ పృథక్*

(వేదాన్ని మహర్షులు ప్రాప్తి, ఉపాయ, అనుకారాలతో పొంది, ఒకటే అయినా అనేక మార్గాలలో దాన్ని సాంప్రదాయకంగా భిన్న చెబుతారు). పై శ్లోకానికి పురాణాలు వ్యాఖ్యానం ఇలా ఉ "యాం సూక్ష్మాం నిత్యాం అతీంద్రియాం వాచం సాక్షాత్కృత ధర్మా మంత్రదృశః పశ్యంతి, తాం అసాక్షాత్కృత ధర్మభ్యోఽపరే ప్రవేదయిష్యమాణా బిల్మాం సమామనంతి స్వప్న వృత్తమివ ద శృతానుభూతం ఆచిఖ్యాసంత ఇత్యేష పురాకల్పః"

మహర్షులు ఆ సూక్ష్మమైన నిత్యమైన అతీంద్రియమైన వాకు సాక్షాత్కరింప చేసుకొని మంత్రాన్ని దర్శించారు. ఆ దర్శనంలేనివా - వారి అనుభవాల్ని స్వప్నవృత్తాంతాల్లాగా వ్యాఖ్యానిస్తా రాః సంప్రదాయం]

అందువల్ల భాషవిషయంలోకూడా వర్ణ, పదాలను, వాక్యా అతిశయించిన "అఖండ"మైన అవగమనశక్తి ఉందని - దానికి సృష్టి, అర్థ సృష్టి ఒకేకాలంలో చేసే మహత్తర శక్తి ఉందని దా "స్ఫోట" అని అంటారని భర్తృహరి సిద్ధాంతం చేశారు "స్ఫోట" వ వెలికిరావటం, ప్రకాశించటం అని అర్థం. శబ్దమూ అర్థమూ రె ప్రకాశ రూపాలే. అందువల్ల స్ఫోట సిద్ధాంతమని దీనికి పేరువచ్చి

ద్వావుపాదేన శబ్దేషు శబ్దే శబ్దవిదోవిదుః
ఏకో నిమిత్తం శబ్దానామ్ అపరోఽర్థే ప్రయుజ్యతే (వా.ప.1-44)

ఏక: అంటే శబ్దమని అర్థం, శబ్దం పదరూపాన్ని పొందితే అర్థానికి వాచక మవుతుంది. అపరః—అంటే "పదం"—ధ్వని సముదాయంచేత ప్రకాశమాణ మవుతున్నదని అర్థం. శబ్దానామ్-అన్నపుడు బహువచన ముందని కొందరిభావన అపుడు అర్థం ఇలా వుంటుంది. స్ఫోట —ధ్వని పుట్టుకకు హేతువు—పదం ధ్వని పుట్టుకకు కారణం ఒకఅర్థాన్ని సూచిం చాలని మానవుడు వాంఛించినపుడు తగిన ధ్వని సముదాయం సహకా రాన్ని అపేక్షిస్తాడు—ఆ ధ్వని సముదాయం ఆ అర్థాలను స్ఫుటీకృతం చేస్తుంది—అంటే శబ్దరూపంలో ప్రకాశింప చేస్తుంది. కనుక స్ఫోట వక్త మనసులో ధ్వనిని పుట్టిస్తుంది శ్రోతలో అర్థాన్ని ప్రకటిస్తుంది)

ఇది ఎలావుందో భర్తృహరి చాలా అందమైన ఉపమానంద్వారా చెప్పాడు.

గ్రాహ్యత్వం గ్రాహకత్వాన్ చ ద్వేశక్తీ తేజసోయథా
తథైవ సర్వ శబ్దానా మేతే పృథగవస్థితే [వా.ప 1-55]

[దీపం తనంత తాను ప్రకాశిస్తుంది. తన సమీపానికి వచ్చిన పదార్థాన్ని ప్రకాశింప చేస్తుంది. శబ్దాల విషయమూ ఇంతే. శబ్దానికున్న స్ఫోట ధర్మంచేత దాని అర్థాన్ని ప్రకాశింపచేస్తుంది. ధ్వని సముదా యాన్ని ప్రకటింపచేస్తుంది. ధ్వనుల రూపంలో అభివ్యక్తి పొందిన తన స్వయం వ్యక్తిత్వాన్ని ఆ అఖండమైన "స్ఫోట" నిలుపుకొని ఉంటుంది. అక్కడ శబ్దార్థాలు వేరుగా ఉండవు. అదే ఆ అఖండ శబ్ద బ్రహ్మం—లేదా శబ్దతత్త్వం.

ఇది ఎలాంటిదంటే "మయూరాండ రసం" లాంటిది. నెమలిగుడ్డు లోని రంగులు, పక్షినిర్మాణం- ఇత్యాదులన్నీ అవ్యక్తంగా ఆ నెమలి గుడ్డులోని "సొన"లో ఎలా దాగిఉన్నాయో అఖండ "స్ఫోట"తత్త్వం లో వర్ణ పద వాక్యాది భేదాలు, వాటి అర్థచ్ఛాయలూ ఇత్యాదులన్నీ దాగి ఉన్నాయి.

అండ భావం ఇవాఽపన్నో యఃక్రతు శబ్ద సంజ్ఞకః
వృత్తి స్తస్య క్రియారూపా భాగశో భజతే క్రమమ్
[వా.ప. 1-5

[శబ్ద ప్రక్రియకూడా గుడ్డును పోలిందే గుడ్డునుంచి పక్షిబయట రావటంలోని క్రమదశల్లాగానే శబ్దావిష్కరణలోకూడా ఒక క్రమ కనిపిస్తుంది]

కాని మూలమైన "స్ఫోట"కు విభేదాలు, క్రమాలు లేవు. అభే కత్వం, అక్రమం—దాని లక్షణాలు. మామూలు భాషలోని శబ్దాల ధ్వనులకు ఈ లక్షణాలు అర్థంలో విభేదముండటం, ధ్వనుల నడు వరుస ఉండటం గమనించగలం. కాని మనసులో గుప్తంగా ఉన్న 'స్ఫోట" తత్త్వానికి ఈ లక్షణాలులేవు. కాని చిత్రం ఏమిటంటే ధ్వనిరు మైన శబ్దసహాయం లేకుండా స్ఫోట" దర్శనం జరగదు దానికి వైఖ శబ్దాన్నే ఆశ్రయించాల్సి వస్తుంది.

*నాదస్య క్రమ జన్మత్వాన్న పూర్వో న పరశ్చసః*
*అక్రమః క్రమరూపేణ భేదవానివగృహ్యతే* (వా.వ. 1-48)

(ఇక్కడ నాదమంటే "ధ్వని' దానికి ఒక క్రమముంది. మౌలికం దానికి పూర్వాపరాలు, క్రమమూలేకపోయినా బయటపడ్డప్పుడు భేదా తోనే బయటపడుతుంది. ఒక ధ్వని తరువాత మరోటి బహిర్గమిస్తుంది)

ఇది ఎలా వుంటుందంటే చంద్రబింబం ఒకటే అయినా, దాని ప్ర బింబాలు నీటి అలలపై వందలు వేలుగా కనిపించినట్టు అంటా భర్తృహరి.

*ప్రతిబింబం యథాన్యత్ర స్థితం తోయ క్రియావశాత్*
*తత్ ప్రవృత్తి మివాన్వేతి స ధర్మః స్ఫోటనాదయోః* (వా.వ.1-49)

(ఇక్కడ స్ఫోట-చంద్రబింబం. నాదం (ధ్వనులు) - నీటి అలలలో చంద్ర బింబాలు)

ఈ కారణంచేత వర్ణ, పద, వాక్య స్ఫోటలుగా చెప్పబడేవన్నీ ఒ భ్రాంతి జన్యమైన విభాగాలు తప్ప అఖండమైన శబ్ద స్ఫోట ఒక నిజమైనది. ధాతు ప్రత్యయ విభాగీకరణం భ్రాంతిజన్యమేనని భర్త హరి ప్రతిపాదించాడు (వా.వ. 1-73, 2-240, 2-235)

"శబ్దయోగం" ఏమిటి ?

స్ఫోట సిద్ధాంతాన్ని పూర్వమీమాంస,న్యాయ, వేదాంత, సాంఖ్యాది మార్గాలన్నీ ఖండించటానికి ప్రయత్నించినా పతంజలి ప్రతిపాదించిన యోగమార్గం ఒకటే అద్భుతంగా సమర్థించింది. ఈ విషయాన్ని గురించి చిరకాలం సాధనచేసి విశ్వవిఖ్యాతిగాంచిన పూజ్యశ్రీ ఆచార్య గౌరీనాథ శాస్త్రిగారు ఇలా అంటున్నారు :

". Sphota is not merely the outcome of the investigations in the domain of grammatical source, but the conception of sphoto embodies in itself a truth which speaks for itself. Thus the grammorious have laid down a course of Sadhana of sphota which they believe, will lead the Sadhaka on to emancfation to realise the true nature of word essence, which is equated with the Absolute Brahman of the Vedanta - the prices of the entire phenomenal world, subjective and objective"

(A study in the Dialectics of sphota : P. 80)

[స్ఫోట సిద్ధాంతం కేవలం వ్యాకరణ శాస్త్రంలో చేసిన శ్రద్ధాయుతమైన అన్వేషణల ఫలితం మాత్రమేకాదు. స్ఫోట సిద్ధాంత ప్రతిపాదనలో స్వయం వ్యక్తిత్వం కల్గిన ఒక సత్యంఉంది. దానికి సిద్ధాంతంయొక్క సమర్థనా అక్కరలేదు స్ఫోటను గురించిన ఒకసాధనను వైయాకరణులు భావించారు. ఆ సాధన ద్వారా సాధకుడు శబ్దతత్త్వదర్శనంచేయగలుగుతాడు. నిజమైన శబ్దసార గ్రహణం చేయగలుగుతాడు. అది వేదాంతులు చెప్పే పరం బ్రహ్మమే. అదే సకల భావ, పదార్థ జగత్తుకూ మూల కారణం]

దీనికి కారణం ఏమిటంటే శాస్త్రిగారు ఇలా చెప్పారు :

"But the goal of philosophy in India was not mere nationalisation but rather spiritualisation" (opcir)

[భారతదేశంలో తత్త్వశాస్త్రం యొక్క ధ్యేయం కేవలం హేతుబద్ధంగా సత్యాన్ని ప్రతిపాదించటం మాత్రమేకాదు; దాన్ని ఆధ్యాత్మిక అనుభవంగా మార్చటం].

ఈ నేపథ్యంలో భారతీయ వ్యాకరణ శాస్త్ర ప్రయోజన
అపవర్గప్రాప్తి- (మోక్షమే). దీనికి మార్గంగా శబ్దపూర్వయో
వాగ్వాదం చెప్పడింది. ధ్వని వర్ణరూపంగా సక్రమంగా ఉ
బడే అభివ్యక్తమైన సఖండ వాక్కుద్వారా అఖండమూ అ
అయిన శబ్దబ్రహ్మను గుర్తించటమే -దానితో సాయుజ్యం సాధి
శబ్దయోగం. అంచేత ఈ యోగంలో ధ్యేయమైన అఖండ శ
మొకటే సత్యం; ధ్వని వర్ణాదులు కేవలం కాల్పనికాలు (బ్రహ్మ
జగన్మిథ్యా-అన్న అద్వైత దృష్టికి ప్రతిరూపమే ఈదృష్టికూడా
బ్రహ్మను గురించే సాధకుడు చింతిస్తాడు. దీన్నే శబ్దపూర్వ యో
అంటారు.

ఈ సాధన చేయగా చేయగా ధ్వని వర్ణాములు ఆ అఖండ శ
వ్యంజించే ప్రతిబింపరూపాలే తప్ప వాస్తవికాలుకావని గు
ఈ శబ్దయోగాన్ని భర్తృహరి ఎక్కడా వాక్యపదీయకారికల్లో
పోయినా వ్యాఖ్యాతలు గుర్తించారు, విశదీకరించాము. వ్యాఖ
వాక్యాలివి.

1. శబ్దపూర్వం—యోగం లభతే (వా.ప. 1-14 క్రింద]

2. తస్మాత్ చ సత్తానుగుణమాత్రాత్ ప్రతిభాఖ్యాత్ శబ్ద
యోగ భావనాభ్యాసా సాక్షేపాత్ ప్రత్యస్తమిత సర్వ విక
మాత్రాం పరాం ప్రకృతిం ప్రతిపాద్యతే [1-14 క్రింది]

3. తదభ్యాసాచ్ఛ శబ్ద పూర్వకం యోగమభిగమ్య ప్రతిభా
అవ బుధ్య నియతా క్షేమ ప్రాప్తిః [1-123 క్రింద]

4. తస్మా ఏవ వాచో వ్యాకరణేన సాధుత్వ జ్ఞాన లభ్యేన శ
పూర్వయోగేనిధి గమ్యతే [1-134 క్రింద]

[(2)శబ్ద పూర్వయోగమన్న దాన్ని సాధనచేస్తే ప్రతిభ(ప
ద్వారా, పరా ప్రకృతి స్థితిని చేరుకోగలుగుతాం (3) ఈయోగ
పశ్యంతీ స్థితి నందుకొని సాధకుడు క్షేమం పొందగలడు]

(2) (3) లలో చెప్పబడ్డ విషయ సంగ్రహీకరణమే మొదటిది(1-14) వ్యాఖ్యాత ఇలారాశాడు "సాధుశబ్ద ప్రయోగాచ్ఛాభి వ్యక్తధర్మవిశేష మహాంతం శబ్దాత్మానం అభిసంభవన్ వైకరణ్యం (వైకల్యం) ప్రాప్నో తి" —సాధుశబ్ద ప్రయోగంచేత "ధర్మ" సిద్ధిగలిగి అభ్యుదయము కలుగుతుంది. తద్వారా కైవల్యప్రాప్తి సిద్ధిస్తుంది. సుష్ఠుశబ్ద ప్రయోక్త స్వర్గంలో "కామధుక్కు" అవుతాడన్న మాటకు వ్యాఖ్యానమే ఇదంతా.

(4) ప్రకారం పశ్యంతీ స్థితిని చేరుకోవడానికి "సాధు" శబ్ద ప్రయోగ కుశలత అవసరం. అదివ్యాకరణంద్వారా సిద్ధిస్తుంది. అపభ్రష్ట శబ్దాలను పరిహరించి సాధుశబ్ద పరిగ్రహణం చెయ్యడానికి వ్యాకరణం సహకరిస్తుంది. ఈ సాధుత్వజ్ఞానం ఉన్నవాడికి "పశ్యంతీ" దశన చేరుకోవటం సులభం. ఇదంతా శబ్దాన్ని పూర్వంగాకలిగిన "శబ్దపూర్వ యోగం"

ఈ యోగంలో "పశ్యంతీ" సిద్ధి జరిగే విధానం గురించి వాక్య పదీయ వ్యాఖ్యాత ఇంకా ఇలా అంటాడు :

*"భేద విషయత్వాత్ క్రమస్యత్ర క్రమవర్ణానుగమనం నపశ్యంతి తతశ్చ్వసత్యలిన్న విషయ వ్యాసంగాభావే ఏకవస్తూప సంహృతాం తఃకరణ తో యోగం లభతే"* (1-14 క్రింద)

(క్రమం ఉండటమంటే విభాగీకరణ - భేద పరిగణన - ఉండ టమే. శబ్దబ్రహ్మ అఖండంకాబట్టి క్రమరహితం కావాలి. ఆ శబ్దాఖండ త్వం మీద మనసును కేంద్రీకరించినపుడు ధ్వని వర్ణాదుల క్రమఖండ ధర్మాలు కనబడవు. అలా అంతఃకరణానికి ఏకవస్తుదర్శన ముఖమైన యోగం లభిస్తుంది.)

ఇలా శబ్దపూర్వయోగం క్రమంగా వైఖరి మధ్యమల నుంచి పశ్యంతి వైపు సాధకుడి అంతఃకరణాన్ని తీసుకువెళ్తుంది. క్రమసంహార పద్ధతిద్వారా ఈ సాధన జరుగుతుంది. ధ్వనివర్ణ పదాదుల క్రమం నశిం చడమే ఇక్కడ ప్రధానం. వైఖరిలో ధ్వని వర్ణాదుల క్రమం ఉంటుం దని, మధ్యమలో ఈ క్రమం ఒకింతమిగిలేఉంటుందనీ వ్యాకరణవేత్తలు గుర్తించారు. కాని పశ్యంతీ స్థితిలో ఈ క్రమమేదీ ఉండదు. ఇలా

స్థూల శబ్దదశనుంచి సూక్ష్మం, అతిసూక్ష్మ అత్యంతసూక్ష స్థితిలో క్ర
రహితత్వ శబ్దార్థ ప్రతిపత్తిగల అఖండ శబ్దబ్రహ్మ సాక్షాత్కారం పొం
టమే ఈ యోగం.

ఇది ఎలా జరుగుతుందో కొంత వివరణ అవసరం వైఖరి చెవు
వినిపించేది ముఖంలోని అవయవాలు సృష్టించేది. వైఖరి అన
వైవిధ్యమయమైన ధ్వనులతో కూడింది. సాధు, అపభ్రంశ శబ్దా
పాటు పశు పక్ష్యాదుల కూతలు, వేణు, మృదంగ పటహాది క్రమా
ధ్వనులన్నీ వైఖరికిందే వస్తాయి. ధ్వనులు అనుక్రమణిక వైఖ
ప్రధాన ధర్మం.

మధ్యమను మనస్సు గుర్తిస్తుంది. అంచేత వైఖరికన్నా గ
మైంది, ఏ బాహ్యమైన ఇంద్రియ గ్రహణానికీ లొంగనిదీ అం
వైఖరి శబ్దాలలోని "అనుక్రమణం" దాదాపు ఇందులో లేకపోయి
సూక్ష్మమైన ప్రాణవృత్తికి ఒక విధమైన అనుగమనం మధ్యవ
ఉంటుంది. శబ్దానుక్రమణం లేకపోయినా భావానుక్రమణం ఉం
దని అర్థం.

పశ్యంతిలో ఈ రెంటి అనుక్రమణమూ ఉండదు. అసలిక్కడ
భావాలు రెండూ వేరుగా లేవు. అంచేత ఏ క్రమమూ ఉండదు.
పశ్యంతిలో మూడు దశాంతరాలున్నాయి.

I) మొదటి దశలో వైఖరిలోని శబ్దానుక్రమణిక, మధ్యమ
భావానుక్రమణిక సూక్ష్మరూపంలో ఉంటాయి.

II) రెండోదశలో ఈ రెండూ గుర్తించరానంతగా చైతన్యశ
లో మునిగి ఉంటాయి.

III) మూడో దశలో ఈ భేదాలనుండి విముక్తిని పొంది అ
రూపంగా ప్రకాశిస్తుంది.

అందుకే పశ్యంతి లో వ్యష్టి, సమిష్టి రూపాల్లో అభివ్యక్తి పొం
(ఉన్మేషం తదతీతంగా అంతర్ముఖమయే లక్షణం (నిమేషం ఉంట

లౌకికమైన వైఖరిలోని సాధు-అపభ్రంశ లక్షణాలు పశ్యంతికి పట్టకపోవటానికి కారణంఅదే. అక్కడ ఏ అనులోమ విలోమ, సారూప్య విరూప్య భేదాలు ఏవీలేవు. ప్రాణశక్తికి అనుగుణంగా ప్రవర్తించే లక్షణంకూడా పశ్యంతికి లేదు. పూర్వ పశ్చాద్ భేదాలు లేక అది ఎల్లపుడూ ప్రకాశిస్తూ ఉంటుంది. దర్శనం దాని లక్షణం (పశ్యతి-క్రియకు అర్థం ఇదే) — దాని కాంతి "అంత్యా కాలేఽన సోమస్య" అన్నారు. అమృతుడైన చంద్రుని చంద్రికలాంటిదది. దానికిఏమలినమూఅంటదు ఆది ఎప్పుడూ అపభ్రష్టం కావటానికి వీలులేదు. అది నిత్యముక్తస్థాయి. దానిలోఅభేదం పొందటానికి క్రమసంహార యోగాన్ని అవలంభించాలి దానికి "శబ్ద యోగం" పునాది. ఇదే అద్వైత యోగాల్లో అతిశ్రేష్ఠమూ - పురాతనమూ. సర్వయోగ సంప్రదాయాలకూ మూలకందమూ.

దీన్ని సాధించడానికి శబ్ద బ్రహ్మను సర్వత్రా చూడటం నేర్చుకోవాలి. అలాంటి శబ్ద సాధకునికే ఈ యోగం లభిస్తుంది. పతినిమాత్రమే "జాయ" (ధర్మపత్ని) తన నన్న స్వరూపాన్ని దర్శింపచేస్తుంది. అలాగే వాగ్దేవికూడా అలాంటి వాచస్పతినే అనుగ్రహిస్తుంది.

భరతమిశ్రుడు "స్ఫోటసిద్ధి' అనే గ్రంథంలో "ఉతత్వ=పశ్యన్ నదదర్శవాచమ్" ఇత్యాది పూర్వోక్త వేదమంత్రాన్ని వ్యాఖ్యానిస్తూ ఇలా అన్నాడు.

"యథాఖలు ఋతుస్నాతాజాయా ప్రాక్తనం రజోదూషితం వసనం అపాస్య సువాసాస్సతి సంభోగేచ్ఛుః ప్రణయ ప్రకర్షాపనీయ మానత్రపా తస్మిన్నపి వాససి శనైః స్రంసమానే స్వాంతనుం అనవయకేన పరిణాయకాయ వివృణుతే, తద్వద్ ఇయంవాణీ వ్యాకరణ తీర్థస్నానాపనీత దుష్టశబ్దాచ్ఛాదనా ప్రయోగ నియమాను గమ్యమాన శోభన వర్ణ వసనానతీ ఉశతీ ప్రకాశీదంతీ యోగాభ్యాసరూప ప్రణయాతిశయ శిథిలీకృతా జ్ఞాన లజ్జా వర్ణాకార విపర్యా సవసవేఽపి శనైః స్రంసమానేస్రి స్వాంతనుం అనవయకేనశాబ్దిక పరిణయకాయ వివృణుతే"

[ప్రి. 28-29]

[ఋతుస్నానంచేసి పాతవస్త్రాలు వదలివేసిన కాంత మ
వస్త్రాలు ధరించి తనభర్తపై ఎంత ప్రణయాదరం ఉన్నా కా
కాంతే తన అవయవ సౌందర్యాన్ని తన ప్రియుడికి ప్రదర్శించిన
వాణికూడా వ్యాకరణమనే పుణ్యతీర్థంలో స్నానమాడి దుష్ట శబ్దాచా
నము తొలిగించుకొని సు"వర్ణ"వసనాశోభితయై యోగాభ్యాస రూప
ప్రణయాతిశయంచేత శిథిలీకృతమైన అజ్ఞానం కలిగిన వైయాక
పండితుడనే తన ప్రియుడికి కొద్దికొద్దిగా తన తత్త్వాన్ని ఆవిష్కరిస్తు

యోగసిద్ధి ఒక్కక్షణంలోకాదు. అదికొన్ని ఘట్టాలలో జరుగుతు
ఆ ఘట్టాలను గురించిన మహర్షుల వివరణను తరువాత పరిశీలిద్దాం.

విద్య - అవిద్య

శబ్దాన్ని ఎలా ఉపాసిస్తే విద్య అవుతుందో ఎలా చూస్తే అ
అవుతుందో ఉపనిషత్ ద్రష్టలు ఇలాచెప్పారు. ఈశావాస్యం
నిర్వచిస్తున్నది.

విద్యాం చా విద్యాంచ యస్త ద్వేదోభయగ్ం సహా
అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయామృత మశ్నుతే —

[విద్యావిద్యలను రెండింటిని తెలుసుకొని అవిద్యవల్ల మృ
వునుదాటి, విద్యవల్ల అమృతత్త్వాన్ని పొందుచున్నాడు]

ఏదో ఒక కామ్య సిద్ధికోసం అగ్నిహోత్రాది కర్మలు చెయ్య
అవిద్య; నిష్కామకర్మగా ఆ విధినేచేస్తేఅదివిద్యఅవుతుంది. అమృత
సిద్ధి అంటే జ్ఞానంద్వారా కలిగే సర్వకామవిముక్తి అని అర్థంచెప్ప
దాన్నే మోక్షమని మత పరిభాషలోనూ, శాంతస్థితి అని అల
పరిభాషలో చెప్పారు.

ముండకోపనిషత్తు దీన్ని మరకొంత వివరించింది.

'ద్వే విద్యే వేదితవ్యే ఇతి హస్మయద్ బ్రహ్మవిదో వదంతి-
పరాచైవాపరాచ

తత్రాపరా ఋగ్వేదాది విద్యారూపిణీ; పరాయయాత
దక్షరమధిగమ్యో

[రెండువిద్యలు నేర్చుకోదగ్గవని బ్రహ్మవిదులంటారు — పరావిద
అపరావిద్య - ఋగ్వేదాది విద్యలు, అపరావిద్యలు, తదక్షర ప్రా
కల్గించే ఉపనిషద్విద్య పరావిద్య]

ఆ ఉపనిషత్తులు బోధించే తదక్షరసాధనరూపమైన విద్య శ్రీవి
అన్నారు. దీన్నే ఆత్మవిద్య అనికూడా అన్నారు.

ఆతదక్షరాన్నే అక్షరపరబ్రహ్మమని, మహావిష్ణువని, మహేశ్వ
డని, పురుషుడని అన్నారు అ విద్యనే సరస్వతి అని, మహాలక్ష్మి అ
ఉమ అని, ప్రకృతి అని పిలిచారు. మళ్ళీ వీరిరువురినీ అర్థమని,వాక్
సిద్ధాంతీకరించారు. ప్రకాశ విమర్శాంశలని తాంత్రికులు సంకేతాలు
పిలిచారు. ఈఇరువురి అద్వైత స్థితిని గుర్తించటమే పరావిద్యకు పరా
లోకంలో చాలా వేరువేరుగా ఉంటున్న శబ్దార్థాలు లోపలికి పోగాపో
తమ భేదాలను పోగొట్టుకొని ఒక సమైక్య మహాశక్తిగా దర్శనమిస్తా
యోగి దాన్ని ఉపాసిస్తాడు. కవి దాన్ని దర్శించి వర్ణిస్తాడు.విమర్శక
దాన్ని వ్యాఖ్యానిస్తాడు. ఇలా వేదవిద్య పురాణేతిహాస కావ్య వాఙ్మయం
భారతదేశంలో అవతరించి శబ్దయోగాన్ని సమగ్రంగా నిర్వచించిం

## వాక్కు సమర్చన - వాక్కు అనంతత్వం :

యతులైనా మంత్రోపాసకులైనా, జ్ఞానులైనా యోగులైనా ధా
పూజల నిమిత్తం "వాక్కు"ను ఆశ్రయించి సమర్చిస్తారు. వాక్కే
సిద్ధికి ఆధారం. ఆ వాక్కును పలురకాలుగా పిలిచారు.

మాత్రైకా భిన్నరూపేణ కమలాఖ్యా సరస్వతీ
సావిత్రీ సాచ సంధ్యా చ భూతకార్యస్య భేదతః

(కాళికాపురాణం)

ఉమేతి కేచి దాహుస్తాం శక్తిం లక్ష్మీం తథాపరే
భారతీత్యపరే చైనాం గిరిజేత్యంబికేతిచ
దుర్గేతి భద్రకాళీతి చండీ మహేశ్వరీతిచ
కౌమారీ వైష్ణవీ చేతి వారాహీచ తథాపరే

బ్రాహ్మీతి విద్యావిద్యేతి మామేతిచ తథాపరే
ప్రకృతిశ్చ పరాచేతి వదంతి పరమర్షయః
[బృహన్నారదీయ

పరాస్వరూపం

ఇంతదాకా శబ్దయోగాన్ని స్ఫోటవాదులు ఎలా భావించ
చూశాం. ఇపుడు చక్రోపాసకులు చతుర్విధాత్మకమైన వాక్కును
"యోగ" సాధనలో భాగంగా ఎలా ఉపాసించారో చూద్దాం.

యా సాంతరోహరూపా పరామహేశ్ త్రిశావితా సైవ
స్పష్టా పశ్యంత్యాది త్రిమాతృకాత్మచ చక్రతాం యాతా
(కామకళావిలాసం-ఆనందపాదం.

(ఏ శక్తి అవాఙ్మానసగోచరమో, ఏది సంకల్పేచ్ఛా స్వ
మైందో, ఏది సర్వవ్యాపన నియామక ధర్మాలుకల్గి మహేశ్వరరూప
తుందో ఆపరాశక్తే మూడు ప్రకారాలుగా ఆవిర్భవించి స్పష్ట
పశ్యంతి, మధ్యమా, వైఖరులనే మాతృకా రూపాలుగా శ్రీచక్రాకార
పొందింది)

ఈ పరావాగ్ దేవతకున్న నాలుగుస్థానాలు పరా, పశ్యంతి, మధ
వైఖరులు. పరనుంచి వైఖరి ఎలా ఏర్పడుతోందో సాధకుల వివ
ఇలా ఉంటుంది.

"సకల క్రియా వ్యవహారానికీ మొదట్లో సహస్రార ప
వర్తియైన సాక్షి స్థానంలో స్ఫురణశక్తి కలుగుతోంది.
ఆ క్రియ ఏ ఇంద్రియ సంబంధమైనదో ఆ ఇంద్రియంచేత
పింపబడి ఆ ఇంద్రియం చేత ఆ కార్యం నిర్వహింప
తోంది కాబట్టి ఇదే పద్ధతి వాగుచ్చారణంలోకూడా ప్రవర్తిస్తు
కనుక ఒకానొక శబ్దాన్ని ఉచ్చరింప దలచినపుడు ము
సహస్రారంలో ఇచ్ఛ పుడుతుంది. అదే పరావాక్ స్థానం. తరువా
వాగుచ్చారణకు వాయువు ఆధారం కాబట్టి ఆ శబ్దోచ్చారణేచ్ఛపుట్

అక్కడనుండీ వ్యాపించిఉన్న పరానాడి ద్వారా ప్రేరణమయి మూలా ధారంలో వాయువు పుడుతుంది. అది పశ్యంతీ స్థానం. ఆ వాయువు పరా నాడిద్వారా స్వాధిష్ఠాన, మణిపూరాలుదాటి అనాహతమన్న పేరున్న సంవిత్కమలాన్ని పొందినపుడు మధ్యమ అని పిలువబడుతుంది. అక్కడి నుంచీ విశుద్ధకమలాన్ని పొందినప్పుడు వైఖరి అన్నపేరు పొందుతుంది. తేజోరూపమైన స్పష్టాక్షరాల్తో జిహ్వనుచేరి ఉచ్చరింపబడుతోంది. సహస్రార గతమైన పర; మూలాధారగతమైన పశ్యంతి, సంవిత్కమలంలోని మధ్యమ - శ్రుతిగోచరాలు కావు కాబట్టి మనుష్యులు గుర్తింపజాలరు."
(చూ. కామకళా విలాసం పు. 160-161)

ఈ తాత్పర్యాన్ని సూత్రీకరిస్తూ బాలాత్రిపురసుందరీ రూపమైన మహా తత్త్వంగా పరావతరణాన్ని మాతృకా వివేకమన్న గ్రంథం ఇలా వర్ణించింది.

> *మూలాధార సముత్పన్నః పరాఖ్యో నామ సంభవః*
> *స ఏవోర్ధ్వతయా నీతః స్వాధిష్ఠానే విజృంభితః*
> *పశ్యంత్యాఖ్యామవాప్నోతి తయోరోర్ధ్వం శనైశ్శనైః*
> *అనాహతే బుద్ధితత్త్వ సమేతో మధ్యమాభిదః*
> *తథా తయోర్ధ్వం మన్నస్నన్ విశుద్ధౌ కంఠదేశతః*
> *వైఖర్యాఖ్య ఇత్యాది శ్రుతి స్మృతి సిద్ధా పరావాగ్దేవీతి*

(పైన చెప్పినట్లు పరావాక్కు సహస్రార శతమనటం సమయ మతం. ఇక్కడ పరావాక్కు మూలాధార శతమని చెప్పబడింది - ఇదే కౌళమతం. దీని ప్రకారం స్వాధిష్ఠానంలో పశ్యంతి; అనాహతంలో మధ్యమ; కంఠ దేశంలో ఉన్న విశుద్ధంలో వైఖరి పుడుతున్నాయి. ఈ తేడాను మినహా యిస్తే శబ్దయోగ పద్ధతిలో అట్టి భేదం కనిపించదు.

> *యన్మకారీ మంత్రయతే యద్వోపి దృత్ప్రతిప్రతా*
> *అరిష్టం యత్కించ క్రియతే అగ్నిస్తదనువేధతే* - అని శ్రుతి ప్రమాణం

(శబ్దబ్రహ్మ స్వరూపమైన పరాశక్తికి పశ్యంత్యాది నామాలు కలగడా నికి కారణం శ్రుతి వాక్యం ఇలా చెబుతోంది. పరావాగ్దేవత ఏ కారణం

చేత మూలాధారంలో మంద్రస్వరం కల్గిందో ఆ కారణం చేతనే కుమ
అని పిలువబడుతోంది. పరాకాశంలో స్ఫురణ కలగగానే మూలాధారం
వాయూత్పత్తి కలుగుతుంది. ఆ సమయంలో సద్యోజాత శిశువుల
మంద్రస్వరంతో కూడి ఉంటుందా శబ్దం. కనుక ఈ దశ సో కుమారీనాః
పశ్యంతీ దశ రెండూ సిద్ధిస్తున్నాయి. సంవిత్ కమలంలో ఆ వాయు
ప్రవేశించినపుడు పూర్వం కన్నా స్పష్టమైన స్వరం పొంది యో
సంజ్ఞ పొందుతోంది. ఇది మధ్యమావస్థ విశుద్ధ కమలాన్ని పొందినః
పదవర్ణ విభాగరూపంగా స్పష్టంగా విభక్తమై పతివ్రత అయిన ప్ర
స్త్రీలాగా దర్శనమిస్తుంది. అపుడామెకు వైఖరి అని పేరు వస్తుం
ఇంతేకాకుండా సహస్రారగతమైన చంద్రమండలం నుండి అమః
స్రావాన్ని కల్గజేస్తూ 72వేల నాడీ సముదాయాన్ని ఉద్దీప్తం చేస్తో
ఆ అమృతవృష్టికి స్వాధిష్ఠానాన్ని సుషుమ్నద్వారా సర్వదా సహాయి
ఉందని ఈ శ్రుతి తాత్పర్యం)

సర్వవ్యంజన రూపాదుల ఆవిష్కృతి :

వ్యాకరణం భాషలో అచ్చులు హల్లులు ఉంటాయని గుర్తిం
వాటి ఆవిష్కృతి ఎలా జరుగుతుందో స్థానకరణ ప్రయత్నాదుల ద్వా
మాత్రమే వివరించింది. కాని శబ్ద సాధకులు మరోవిధంగా ఈ ప్ర
యను నిరూపించారు.

సహస్రారగతమైన అవక్తాక్షరరూపం ఒకటుంది. దాన్ని సవిద్బి
వన్నారు. స్వరవ్యంజనరూపాదికమైన మాతృకోత్పత్తికి ఈ సంవి
దువే తొలిదశ. ఆ బిందువు త్రికోణ చక్రాకార రూపాల్లో పరిణవి
నాదోత్పత్తిని కలిగిస్తోంది ఆనాదంలో అకారాది 16స్వరాలు పుడ్తున్నా
ఆ స్వర సంయోగంలో వ్యంజనాలైన కకారాదులు పుడుతున్నా
బిందు నాద కళలు పరస్పరం సంబంధాన్ని పొంది అఖండమైన
తత్త్వాన్ని నిరూపిస్తున్నాయి. కోణ బిందువులు విసర్గలుగా ఉన్నా
ఇలా బిందు—విసర్గ—స్వర—వ్యంజన రూపాలుగా 50అక్షరాల్తోక
వర్ణమాలగా సంవిత్ బిందువు వ్యక్తీకృతి పొందుతోంది. అకారా
స్వరాలు విమర్శాంశంగా, అకారాది 36 వ్యంజనాలు ప్రకాశాం
బయటపడుతూ సమిష్టిమాతృక శివశక్తి స్వరూపమని నిరూపిస్తున్న

*అజ్వ్యాలింజన బిందు త్రయ సమిష్టి భేదైర్వి భావితాకారా*
*షట్త్రింశత్తత్వాత్మా తత్వాతీతా చ కేవలా విద్యా*
(కామకళావిలాసం 18 వ సూత్రం)

[అచ్చులు స్వరాలు, వ్యంజనాలు, హల్లులు, అనుస్వార త్రయం బిందువులుగాగల వ్యష్టి సమష్టి భేదాలచేత విభజింపబడ్డ స్వరూపంకల్గి 36 తత్త్వాలతోకూడి, దానికి అతీతమై పంచదశీ విద్యారూపంగా ప్రకాశిస్తోంది)

మంత్రసాధకులు ప్రతివర్ణాన్నీ జపించి ఆ వర్ణంలో అంతర్లీనంగా ఉన్న శివశక్తి తత్త్వాన్ని ఉపాసిస్తారని అర్థం ఇలా వైఖరీరూపమైన వర్ణం సాధనలో మెల్లమెల్లగా తన నిజమైన అంత స్వరూపాన్ని సాధకుడికి ప్రత్యక్షం చేస్తుందన్నమాట. సాధకుల శబ్దయోగ స్వరూపం స్థూలంగా ఇదే.

కనుకే పరాపూజా స్వరూపాన్ని గురించి చెబుతూ కామకళావిలాస కర్త—పుణ్యానంద మునీంద్రుడిలా అన్నాడు :

*వాచ్యార్థానామశేషేణ వేద్యవేతృ విదాత్మనాం*
*స్థితిః పరోభవేద్యోమ స్సర్వ భేద విలాపనాత్*
*స్వాత్మరూప మహావహ్ని జ్వాలా రూపేషు సర్వదా*
*నిరింధనం చేద్ధరూపే పరమాత్మని సుస్థిరే*
*నిర్వ్యుత్థాన విలాపస్తు పరాహోమస్స మీరితః* [పు. 247]

[వేద్య, వేతృ స్థితులకు అతీతమైంది. ఆ పరాస్థితి అది సర్వభేద విలాపనం (నాశనం) వల్లనే సిద్ధిస్తుంది. స్వాత్మరూపమైన మహాగ్నిలో ఈవాచ్యార్థరూపమైన సర్వభేదాలను హోమంచేయటాన్నే పరాహోమ మని సంప్రదాయంలో వ్యవహరిస్తారు.]

వాచ్యార్థాన్ని, వేద్య (తెలుసుకోదగిన) వేతృ (తెలుసుకొనేవాడి) విత్ (జ్ఞానం)—ఈ మూడు భేదాలను అతిశయించడమే పరాహోమం,

మంత్రానికి వాంఛితార్థం ఉంది తప్ప వాచ్యార్థంలేదు. దా
అతిశయించి సాధకుడు మంత్రాన్ని ఉపాసిస్తాడు.

కావ్యవాగుపాసన - రసధ్వని సిద్ధాంతం :

తాంత్రికుల్లాగానే అలంకారికులుకూడా కావ్యవాక్కును వాచ్యా
శాయి అయిన రసధ్వని సాక్షాత్కారంకోసం ఉపాసించాలన్నా
ఆనందవర్ధనుని ధ్వనికారిక ఈ అర్థాన్నే చెబుతోంది.

*యత్రా౽ర్థః శబ్దో వా తమర్థ ముప సర్జనీకృత స్వార్థౌ*
*వ్యంక్తః కావ్య విశేషః స ధ్వనిరితి సూరిభిః కథితః*

[ధ్వన్యాలోకం 1-13]

కావ్యవాక్కులోని శబ్దాలూ, అర్థాలు తమతమ వాచ్యార్థ
అప్రధానంచేసి ఎక్కడ ఆ అర్థాన్ని [రసార్థాన్ని] వ్యక్తం చేస్తా
అది "ధ్వని"—అని ఈ కారికకు అర్థం.

శబ్దం ప్రాకృతమని [పరా పశ్యంతీ మధ్యమలు] వైకృ
[వైఖరి] రెండువిధాలన్న స్ఫోటవాదుల్ని అనుసరిస్తూనే ఆనం
నుడు ఆ ప్రాకృత ధ్వని సందర్శనమే కావ్యానుశీలన ప్రయో
మన్నాడు. అందుకే వైకృతమైన శబ్దం దానితో రూఢిసంబంధ
అర్థం — అవి బోధించే వాచ్యార్థ ప్రతిపత్తి కావ్యార్థ గ్రహణ స
ప్రక్రియలో లోపించి — దాని నతిశయించిన వ్యంగ్యార్థం అభివ
మవుతుందన్నాడు- కారణం కావ్యవాక్కు గోరూపమైన సరస్వతి
ఆ తల్లి తన్నుపాసించే కవిబాలకుల రసతృష్ణను తీర్చడానికి ప్ర
రూపమైన తన అంతస్తత్త్వాన్ని స్ఫురణరూపంలో నిరంతరం ప్ర
ఉంటుందని ఆనందవర్ధనుడు ఒకకారికరాశాడు [దేవీం వాచవ
యంత — ఇత్యాది పూర్వ మంత్రార్థాన్ని ఇక్కడ సంపదించుకోవచ

*సరస్వతీ స్వాదు తదర్థవస్తు నిష్యందమానా మహతాం కవీనామ్*
*అలోక సామాన్య మభివ్యనక్తి పరిస్ఫురంతం ప్రతిభావిశేషమ్*

[ధ్వ. ఆ.

ఇక్కడ సరస్వతి అంటే "వాగ్రూప అయిన భగవతి"
అభినవగుప్త పాదులు వివరణ చెప్పారు.

ధ్వన్యాలోకంలోని నాల్గు ఉద్ద్యోతాల చివరా అభినవగుప్తులు చతుర్విధాలైన వాక్కులను స్తుతించి కావ్యవాగుపాసనకూడా శబ్ద యోగమే అని నిరూపించారు.

యదున్మీలనా శక్త్యైవ విశ్వమున్మీలతి క్షణాత్
స్వాత్మాయతన విశ్రాంతాం తాం వందే ప్రతిభాం శివామ్
[పు. 172]

పారిచ్యం పోరిమ్లానమాత్రం స్యాద్భేదేవా సూత్ర్యతే యయా
వందేఽభినవ గుప్తోఽహం పశ్యంతీం తవిదంజగత్
[పు. 310]

అసూత్రితానాం భేదానాం స్ఫుటతా పత్తి దాయినీమ్
త్రిలోచన ప్రియాం వందే మధ్యమాం పరమేశ్వరీం [పు. 556]

స్ఫుటీకృతార్థ వైచిత్ర్య బహిః ప్రసరదాయినీమ్
తుర్యాం శక్తి మహం వందే ప్రత్యక్షార్థ నిదర్శనీమ్ [పు. 603]

రసంలో అభిన్నంగా ఉన్న వాక్కు ఉన్మీలనం పొందగానే కవి నోట శబ్దం నిర్గమిస్తోంది. అది మళ్ళీ రసంలోనే విశ్రమిస్తుంది. రసాభివ్యక్తికి అనుకూలమైన వ్యంజన సామగ్రిని కావ్యంద్వారా కలివాక్కు సృష్టిస్తోంది. గౌణ తాత్పర్యాది అర్థాలూ, ఉపమాది అలంకారాలు అన్నీ వ్యంజన సామగ్రులే, వీటిద్వారా ఒక లౌకికమైన అర్థం స్ఫుటీకృతమవుతోంది. అదే వాచ్యార్థం. నిదర్శనంతోనే కావ్యాధ్యయనం మొదలు పెడతాం.

అంటే కావ్యంలో బయటకి కనిపించే కథ, పాత్రలు, వర్ణనలు — వీటిని చదువుతూ, నాటక రూపంలో చూస్తూ పోగా పోగా "స్మరణ" మీద క్రమంగా ఆ కథకు పాత్రలు పాత్రల ప్రవృత్తికి వర్ణనలకు ఒక అంతరార్థం ఉందన్న "స్ఫురణ" కలుగుతుంది. ఎవరికి ?

సహృదయునికి అని ఆనందవర్ధనుడు సిద్ధాంతీకరించాడు. ధ్వని ప్రధానమన్న విషయం బుధులచే ముందే చెప్పబడినా సహృదయ మనః ప్రీతికోసం దాని స్వరూపాన్ని వివరిస్తానన్నాడాయన.

(చూ. ధ్వ. ఆ. 1-1)

ఆ సహృదయుడు ఏమకిలీ లేని పరిశుద్ధమైన అద్దంలాంటి ‹
వృత్తి కలవాడని అభినవగుప్తపాదులు వ్యాఖ్యానించారు. సాధారణ
మనుషుల మనస్సులు ఎంత పాండిత్యం ఉన్నా రకరకాల రాగద్వే
దులతో మకిలి పట్టి ఉంటాయి. నిరంతర కావ్య శాస్త్రాభ్యాసం
పండిత శుశ్రూషవల్ల ధార్మిక ప్రవృత్తితోటి జీవనశైలివల్ల ఏ
మనసులో అసూయాద్వేషాలతోకూడిన ఆ "మలినం" ప్రక్షాళితం అ
వుంటుందో అలాంటి విశుద్ధ మనస్కులు వైఖరి శబ్దాన్ని "దీపం" ‹
గ్రహించి హృదయాకాశంలో దాగి ఉన్న మరో మహార్థా
వెదుక్కోగలరట.

ఆ విశుద్ధ మనస్కుని మనోవ్యాపారాన్ని "స్మరణ" అని ఇంగ
చెప్పింది. ఏనాడో తప్పిపోయిన వస్తువునో, మనిషినో గుర్తిస్తున
లోపలే దాగిఉన్న ఆ రసార్థాన్ని వైఖరీ శబ్దం మరలా గుర్తింపచేస్తే
అందుకే దీని అభిజ్ఞాతార్థం అన్నారు. ఈ దార్శనిక ధర్మాన్ని ప్రత్య
అన్నారు.

ప్రత్యభిజ్ఞా నిర్వచనాన్ని పరిశీలిస్తే కావ్యశబ్దోపాసన ఎలాగ
మవుతుందో మనకు బాగా తెలుస్తుంది. ప్రత్యభిజ్ఞా సిద్ధాంతం కా
శివాద్వైత సంప్రదాయంలో పుట్టిన ఒక అత్యుత్తమ దర్శనం ఈసి
తాన్ని తొలుత సోమానందుడు "శివదృష్టి" అనే గ్రంథంలో ప్రతిపా
చగా అతనిశిష్యుడు ఉత్పలాచార్యుడు "ఈశ్వర ప్రత్యభిజ్ఞ" అనే ‹
గ్రంథంలో ఈ సిద్ధాంతాన్ని విపులీకరించాడు. క్షేమరాజు "ప్రత్య
హృదయం" అనే గ్రంథంలో ప్రత్యభిజ్ఞసిద్ధాంతాన్ని ప్రపంచించ

కావ్యంలో వాచ్య వ్యంజన లక్షణాలను ఒకేసారి గుర్తించే ‹
ధర్మం ఈ "ప్రత్యభిజ్ఞ" వల్లనే కలుగుతోందని ప్రత్యభిజ్ఞ నిర్వ‹
చెబుతోంది.

*స్మరణనుభవారూఢా సామానాధికరణ్యధీః*

*సంసారేంద్రియ జన్యాచ ప్రత్యభిజ్ఞా ప్రకీర్తితా*

అని భాస్కరకంఠుని నిర్వచనం (శివశంకర అవస్థి ఈ శ్లోకాన్ని ఉదహరించాడు) కావ్యంలో వాచ్యార్థ ప్రతీతిని సామాన్యాధికరణాలన్నీ గ్రహిస్తాయి. శబ్దాన్ని ఛందోగతినాధారంగా చెవులు గ్రహించి స్పందిస్తాయి. ఇలా కర్మేంద్రియానుభవంగా వాచ్యార్థ గ్రహణం ప్రారంభమవుతుంది. శబ్దాలంకారాలన్నీ ఇలా బాహ్యేంద్రియ తృప్తిని కల్గించేవే.

ఉపమాద్యర్థాలంకారాలలో జ్ఞానేంద్రియ వ్యాపారం మొదలవుతుంది. కవి వివక్షిత మనోభావాన్ని కర్మేంద్రియ జ్ఞానేంద్రియాలు గుర్తించగా స్మరణం మొదలవుతుందన్నమాట. అది చేతస్సు చేసేపని అది సంస్కారగతమైన వాసనను ఆధారంగా ఈపని మొదలుపెడుతుంది.

ఆ వాసనకు విస్మృతిపొందిన ఒక మహాజ్ఞానాన్ని త్రవ్వి పోసుకునే లక్షణమొకటుంది. ఆ త్రవ్వి పోసుకోవటంలో అది "వలవంత" పొందుతుంది. వేదన పొందుతుంది. జననాంతర సౌహృదాలను నెమరువేసుకుంటుంది. ఆ స్మరణ స్థిరమైన భావమే స్థాయిరూపంగా మనుష్యుల్లో నిరంతరం ఆత్మజ్ఞానాన్ని గుర్తుకుతెస్తున్నది.

దేన్ని ఆధారంగా అంటే :— కావ్యంలో వాగ్రూపంగా ఉన్న భగవతిలోని విమర్శ లక్షణం కారణంగా. ప్రకాశరూపంగా ఉన్న శివతత్త్వాన్ని ప్రత్యభిజ్ఞాతం చేసే ధర్మం కావ్యవాక్కులోని వైఖరికివుంది.

[Prati + abhi + jna — Pratyabhijna — అని నిర్వచనం చెప్పారు. ప్రతి-ప్రతీపం (వ్యతిరేకమని) అర్థం) - తెలిసినా మాయావృతమైవిస్మృతిపాలైందనిఅర్థం. అభి-ఉన్ముఖంగా సమీపంలోఉన్నదని అర్థం. జ్ఞా-అంటే తెలుసుకోవటం- ప్రకాశం లేదా కాంతి- అదే జ్ఞానం ప్రత్యభిజ్ఞ అంటే ఆత్మజ్ఞానమని అర్థం- (చూ. జయదేవ్‌సింగ్ ప్రత్యభిజ్ఞా హృదయం- హిందీ గ్రంథం : 1977 : 117)]

ఈ పద్ధతి ప్రక్రియలో సహృదయుడు లోనికి మునిగి తన మనోనేత్రంతో కావ్యలోకాన్ని దర్శించటం మొదలుపెడుతున్నాడు, శబ్దాని లోకంలోలేని ఈ స్మరణ ధర్మం కావ్యంలో అదనంగాచేరుతోంది. దీన్నే

వ్యంజన ధర్మమని ఆనందవర్ధనుడు సిద్ధాంతీకరించాడు. ఈ ధ
కావ్యశబ్దంలోని బాహ్యావరణలు తొలిగిపోయి అంతస్స్వరూపం
జ్ఞాతంకావటం మొదలవుతుంది.

అపుడు సీతారామపాత్రలు శాశ్వతమైన దాంపత్య ధర
కరుణ రసానికి ప్రతీకలై సహృదయునిలో శోకస్థాయిని ప్రబు
అలనాడు వాల్మీకికి క్రౌంచ మిథున ఘట్టంలో పుట్టిన ధార్మిక
మరలా ఘటింపజేసి వాడి లౌకిక ఆధ్యాత్మిక జీవితాలకు కలవుతు

ఇలా కావటానికి రహస్యమంతా శబ్దానికి ఉన్న ప్రచేతన
లోనే ఉంది. ఏ ప్రచేతనశక్తి మహర్షులకు వేదమంత్రాల్ని స
జేశాయో అదే ప్రచేతనశక్తి కలిసి కావ్యరసాన్ని దర్శించేలా శ
అదేశక్తి సహృదయునిలో కావ్యతత్త్వ దర్శనాన్ని కల్గిస్తోంది.
ఆనందవర్ధనుని ధ్వన్యాలోకానికి లోచనం రచిస్తూ అభినవగుప్త

*"సరస్వత్యాస్తత్త్వం కవి సహృదయాఖ్యం విజయతే"*

అని మంగళశ్లోకంలోనే కవి సహృదయులు సరస్వతీ తత్త్వానికి
ముఖాలవంటివారని చెప్పాడు. శివశక్తులనడుమ ఏ దివ్యా దా
సాగుతోందో ఆ ప్రకాశ విమర్శస్వరూపమైన సంయోగం కవి.
యుల నడుమకూడా నిత్యమూ జరుగుతోంది.

దీనికాధారం శబ్దానికిఉన్న వ్యంజనాశక్తే. కవి
మంత్రంలాగా ప్రయోగిస్తున్నాడు. బహుపురాణ సముచ్చయ
చేత పరమ పవిత్రితుడైన నన్నయ భట్టారకుడు కచుడు శుక్రుక
జ్జీవితుణ్ని చేసిన ఘట్టంలో శబ్దానికి కవి ఆపాదించే ఈ మం
గురించి ఒక అద్భుతమైన విషయం చెప్పాడు.

*విగళజీవుడై పడియున్న వేదమూర్తి*
*యుశనుచేత సంజీవితుండై వెలింగె*
*ఘనుడు మంత్రి యుచ్చారణ దశవేత*
*నభిహితంబగు శబ్దంబునట్లపోలె* (ఆది-3-127)

ఈ పద్యంలో ఉన్న వెలింగె, ఉచ్చారణ దక్షత, అభిహితత్వ అన్న మూడు అంశాలు శబ్దయోగదృష్ట్యా చాలా ముఖ్యమైనవి. విశ్వనాథవారు వెలింగె అనే మాటను వ్యాఖ్యానిస్తూ ఇలా అన్నారు :

"అతని చేతిలో పాశుపతాస్త్రము వెలుగుచున్న (౩-౧-౪౬౭) దన పాశుపతమతని యధీనమందున్నదని యర్థము"
(చూ. నన్నయ్యగారి ప్రసన్నకథాకవితార్థయుక్తి

ఆ స్వాధీన శబ్దశక్తి సంపన్నుడు ఉచ్చారణదక్షుడు అవుతాడు సుష్ఠుశబ్దాన్ని తెలిసి ప్రయోగించినవాడు స్వర్గంలో కామధుక్కు అవు డన్న శాస్త్రనియమం ఈ అర్థానికి వ్యాఖ్యానమె.

"మననాత్ త్రాయతే" (మననంవల్ల రక్షిస్తుంది)— అని మంత్ర నిర్వచనం. అలాగే కావ్యశబ్దంకూడా "స్మరణాత్ అవబోధతే"— అ అని చెప్పవచ్చు. ఆ స్మరణ లక్షణాన్ని శబ్దంలో ఘటించటమే అభి తత్వం. భాట్ట మీమాంసకులు అభిహితాన్వయవాదులు, వాక్యార్థం వ ఇచ్చచేత ఒక్కసారిగా పద సంఘటనచేత అభివ్యక్తమవుతుందని వాదులంటారు. స్ఫోట దీనికి సంబంధించిన వాగర్థ దర్శనమే. "వా స్ఫోట" అని భర్తృహరి పిలిచినదాన్ని "అసంలక్ష్యక్రమ వ్యంగ్య"మ ఆనందవర్ధనుడన్నాడు. పదాలు తమ అర్థాలను ఒక క్రమంలో అన యింపజేసుకొని వివక్షితార్థాన్ని చెప్పేపద్ధతిని సంలక్ష్యక్రమ మన్నాడ ఈ రెండూ పద్ధతులూ కవి వివక్షించే రసార్థాన్ని వ్యాఖ్యానించేవే.

ఇంతకీ పై పద్యంలో కవి బోధించిన అర్థం ఏమిటి? శుక్రుని అనివార్య పరిస్థితిలో శిష్యుడైన కచునికి సంజీవని మంత్రోపదేశ చేయాల్సివచ్చింది. పొట్టలో ఉన్న కచునికి బోధించాడు కచుడు ఒయ పడక తప్పదు. పడితే తాను చావక తప్పదు. అయినా శిష్యుని మీ నమ్మకంతో గురుపు మంత్రాన్ని ఉపదేశించాడు.

ఒకసారి బోధించిన మంత్రం శిష్యుడిలో స్థిరపడింది. ఆశిష్యు వేదవిద్యకు గురువైన బృహస్పతి తనూజుడు. కచుడు— శిఖరప్రాయ డని అర్థం. గురుఋణం తీర్చుకోవటానికై మరలా మంత్రాన్ని ఉచ

రించాడు. కవి శబ్దంచేత సహృదయునిలో రసబోధకలిగినట్టుగా శుక్ర
కచుని శబ్దోచ్చారణచేత మరలా ప్రాణాన్ని పొందాడు.

ఇక్కడ ప్రాణం పోవటం మృత్యువు అదేవిస్మృతి. ఆత్మజ్ఞా
విస్మరణమని దీన్నే అన్నారు. దాన్ని ధార్మికుడైన కచుడు తొలి
చాడు. గురువు బ్రతికాడు. ఇది కథలోనిలోపలిపొర.
సహృదయునికి ఈ అర్థం తెలియగానేకలిగే మనఃప్రీతికి ఒక జ్ఞా
దేశ ప్రయోజనం కూడా ఉంది. అదే గురుశిష్యబాంధవ్యంలోని పి
పుత్ర సంబంధం. "ఆత్మావై పుత్రనామాసి" అన్న వైదిక మం
తాత్పర్యాన్ని ఈ కథ సూక్ష్మంగా వ్యాఖ్యానిస్తున్నది.

ఇలా కావ్యశబ్దం జ్ఞానప్రదాయకమవుతోంది. అజ్ఞానం కే
వస్తువిషయక పరిజ్ఞానం కాదు. ఆత్మ విషయకమైన పరిజ్ఞా
అందుకే భారతాదిమహేతిహాసాల పారాయణంవల్లఅపమృత్యువు నశి
దీర్ఘాయువు కలుగుతుందన్నారు. (అయురర్థులకు దీర్ఘాయురవాప్తిం
అని భారత కావ్యగాన ప్రయోజనంగా నన్నయ్యగారు చెప్పారుకూ

ఈ కారణంచేత భారతీయులకావ్యవాగుపాసన ఒక "వాగ్యో
గా భావించబడింది, సంగీతం నాదయోగమని పిలువబడింది. (
ఆనందకుమారస్వామి ('The dance of Shiva') నాటకం చాక్షుష
వని పిలువబడింది. ఇన్నిటికీ పరమగమ్యం సాధకుణ్ని ఆత్మజ్ఞా
వంతుడిగా మార్చటమే. వాణ్ణి ముముక్షువుగా తీర్చిదిద్దటమే. ప్రా
భారతీయులు శబ్దాన్ని, స్వరాన్ని, అభినయాన్ని, శిలను, యోగ
నకు మాధ్యమికాలుగా గ్రహించారు. అన్ని కళలనూ సరస్వతీ అవ
లుగా భావించారు. అన్ని కళలనూ భగవదర్పితాలుగాచేసి
జీవులై బ్రతికారు. ఏ కళకూ "వాచ్యార్థ ప్రతిపత్తి" పరమ ధ్యే
కాదన్నారు. అన్ని కళారూపాలకూ రసమే పరాకాష్ఠ అన్నారు. ఆ
స్వరూపుడైన భగవంతుడు బ్రహ్మానంద స్వరూపుడుగా; కావ్యాన
దానికి కించిత్తు ఎడంగా ఉన్న రసానంద స్వరూపమన్నారు.

కావ్యవాక్కు రసంలోనే చరిస్తుంటుందని భారతీయులు సిద్ధా
కూడా చేశారు.

"సా వాగ్ యాం సవృత్తిః"

అని ఆంధ్ర శబ్ద చింతామణికారుడు అపూర్వంగా నిర్వచించాడు. ఇ భారతీయుల కావ్యవాగుపాసన యోగ భూమికకల్గి జ్ఞాన సాధనం ప్రకాశించింది.

పాశ్చాత్యులలో కూడా మతపరమైన గ్రంథాలలోని ఈ వాచా ర్థాతిశాయి ధర్మాన్ని కావ్య వాఙ్మయంలో దర్శించటం జరిగి ఉం ధ్వన్యాలోకం లాంటి అపూర్వశాస్త్రం పుట్టి ఉండేదని Ramero A-Gno ఒకచోట అన్నారు. *

భారతీయులలోని ఈ అపూర్వత వాక్కును భగవతీ స్వరూపం భావించి ఉపాసించటంలోనే ఉంది. అందుకే భిన్న శాస్త్రాల మధ సమన్వయం సిద్ధించింది.

*"మహో అర్ణః సరస్వతీ ప్రచేతయతి*
*కేతునాభియో విశ్వా విరాజతి"* (ఋక్కు 1-3-12)

అని వేదం సరస్వతికి ఉన్న ఈ ప్రచేతనధర్మాన్ని కీర్తించింది. ఆధ నిక మహర్షి సావిత్రీ రహస్య వ్యాఖ్యాత అయిన శ్రీ అరవిందుడు ఈ మంత్రానికి అర్థం ఇలా చెప్పారు :

"Sarasvati brings into active eonsciousness in the huma being, the great flood or great movement, the truth-conscious ness it self, and illumines withit all our thoughts"

(The sever of Veda

ఇంతవరకు చర్చించిన శబ్దయోగ భూమిక నేపథ్యంలో ఈ మంత్రార్థాన్ని ఇలా చెప్పవచ్చు.

---

"Had it been developed in a literary direction, we woul have had a sort of counterpart to the conception of Anand vardhana" (Aerthetic Experience According to Abhinava

Gupta Intro P. XXXIV)

శబ్దం సరస్వతీ రూపం. దానికి మనిషిలో వస్తు భావ స
కల్గించే శక్తితోపాటు భావస్ఫురణను కలిగించే ఒక శక్తి ఉంది.
ఒక ప్రవాహరూపమైన కదలిక. సత్యస్పృహ దాని ధర్మం. భావ
ఉద్దీప్తం చేయటం దాని లక్షణం కనుక శబ్దం ఉపాస్యమైన దివ్య
ఆ శక్తిచేతనే ప్రజ్ఞానం కలుగుతోంది. కర్మ ప్రచోదన కలుగుత
ఆత్మదర్శనం సిద్ధిస్తోంది. ఆ భగవతికి నమస్కారం.

*'సరస్వత్యేవేషా ఘటయతి యథేష్టం భగవతీ'*

(ధ్వ ఆ.పు.



# అనుబంధం - 1

## వక్షమర్చనము

ఇది వాగ్దేవికి సమర్చనము. వాక్కులతో సమర్చనము. దేవీస్వరు
పము వాక్కు. ప్రమాణముగలదు. "దేవీం వాచమజనయంత దేవా
తాం విశ్వరూపాః పశవోవదంతీ"త్యాది మంత్రములు. బ్రహ్మదేవు
భార్యగా సరస్వతి చెప్పబడుచున్నది. ఇది పురాణ ప్రసిద్ధ వి
యము. అమరమున "బ్రహ్మీ తు భారతీ భాషా గీర్వాగ్వాణీ సరస్వ
అని సరస్వతికిగల నామాంతరములలో వాక్కుకూడ చేర్చబడినద
ఈ వాక్కు ఎవరు ? ఏమి?

"అదొకపేరు. అనగా శబ్దముకదా! శబ్దమున్నప్పుడు అ
ముండకపోదు. దీనిని దృష్టిలో పెట్టుకొనియే శబ్దము పుట్టుచున్న
అర్థమనగా విషయము-వస్తువు, రూపము శబ్దము నామమ
రెంటిలో ఏది ముందు? వస్తువులేనిపుడు శబ్దములేదు. రూపము పుట్టి
తరువాతనే నామము........సృష్టివేళ పరమేశ్వరుని సంకల్పమ
ననుసరించి ద్రవ్యసృష్టి ఏర్పడినది సంకల్పమే భావము. అ
అర్థము. దానిననుసరించి పుట్టిన వస్తువు శబ్దము కావున అర్థమ
శబ్దము తర్వాత అనగా రూపము ముందు నామము తర్వాత!"

[తుమ్మపూడి కోటీశ్వరరావు స్పంద సౌందర్యము (1974

పై వివరణము ఏమనుటకు సాక్షిక సమాధానము. ఎవర
ప్రశ్న పౌరాణికమైనది. వీణాపుస్తకధారిణి అగు ఒక స్త్రీ దేవత ని
వ్యవహరింతురు. కాని ఏమి అను ప్రశ్న తాత్త్వికమయినది. దేవత
స్మజించిరి. అదొక స్త్రీతత్త్వము. ఇది పరోక్ష నిరూపణ.

సానోమంద్రేషమూర్జ దుహానాధేనుర్వాగ స్మానుప సుష్టు
——నిరుక్తము .11.వ అధ్యాయ

యాస్కుని వ్యాఖ్యానమిట్లున్నది. వ్యక్త వాచశ్చా
వాచశ్చ. సానోమద నార్దంచ రసంచ దుహానాధేనుర్వాగస
పైతు సుష్టుతైతు — అని.

రస దోగ్ధలాదేవతలు. రసప్రసవణరూపి గోమాత ఈ
వత. ఇది ఎట్టి ఉపమానము? సకల ప్రపంచము ఆవరించి
శబ్దతత్త్వము గోవు. చేతనాచేతములందు శబ్దములేని చోటులే

యద్వాగ్వదంత్యవి చేతనాని రాష్ట్రీదేవానాం నిః
మంద్రాచతస్త్ర ఊర్జం దుదుహే పయాంసి క్వసిదస్యాః
పరమం జగామ॥

ఈ ప్రపంచకమున ఆకాశము శబ్దగుణముకలది. "శ
అని పరమాత్మగీత. ఆకసమనగా శూన్యము. వాయువు శబ్దవ
గంధవహముగునట్లు, కావున ఆకసమున వాయువుతో శ
ప్రసరించుచున్నది. దహరమాకాశమును కొన్నచో ప్రాణము వ
వన్నచో శబ్దము హృదయాకాశమున చలించు చున్నదనవ
దేవతలకు ఖేచరులని పేరు. సుమనసులనియు పేరుగలదు.
శాద్యాః సుమనసః—అని మంత్రము. ఈ అభిప్రాయమ
కలిపి చూచినచో మనకు తాత్పర్య రూపముగ మిగులున
సుమనసులు శబ్దమును సృజించిరి—అనుట. భావమునుండి
పుట్టుటనగా ఇదియే. ఇది నిదాన నిరూపణ. ఇది అవ్య
వ్యక్తముగా మారుట.

కావున శబ్దమంతటనుగలదు. శబ్దములేమిని కూడ ని

అశబ్ద పదములచే వ్యవహరింపవలయును కాని భావమును భావ ముఖమున తెలుపుటకు వ్యక్త ప్రపంచమున నెడములేదు. ఈ వ్యక్త శబ్దమునుకూడ వాక్కని వేదము పిలిచినది. ఇది చెవికి వినిపించెడిధ్వని తరంగ రూపదశ. మరి మూడంతర్దశలును గలవని శివాద్వయవాదులు గుర్తించిరి.

"చత్వారి వాక్పరి మితాపదాని" అని వీరి దృష్టి
పరా-పశ్యతీ-మధ్యమ-వైఖరులని ఆ దశలు నాలుగు.
పరావాక్ మూలచక్రస్థా-పశ్యంతీ నాభి సంస్థితా
హృదిస్థామధ్య మాన్యస్తు-వైఖరీ కంఠదేశగా
వైఖరీ హికృతోనాదః-పర శ్రవణగోచరః

(పరమల ఘుమంజూష

భిన్నమతీయులీ అంతర్దశలను భావించు పద్ధతియందు భేదములున్నవి కొందరు మధ్యమా పశ్యంతులే అంతర్దశలందురు.

వైఖర్యామధ్యమాయాశ్చ పశ్యంతాశ్చైతదద్భుతమ్
అనేక తీర్ధ భేదాయా స్త్రయ్యావాచః పరంపదమ్

నాదమును భావించువారు నాభినుండియే నాదవికృతి అందురు. ఇది ఆహతనాద విషయము.

నాభి హృత్కంఠ రసన నాసాదులయందు - (త్యాగరాజు)
"శోభిల్లు సప్తస్వర"

ఎవరెట్లు భావించినను గుర్తింపదగిన అంశము అంతశ్శ మున్నదనుట నోట పలకని చెవికి వినిపించని అశబ్దమున యోగులు భావింతురు. హృదయనాభి మూల చక్రములందు ప వెలుగులు చిమ్మెడి ఆ వాగ్దేవతనే భిన్న నామముల యోగు

కవులు సహృదయులు భావించుచున్నారు. యోగి ధ్యానము
గాని, కవి కావ్యవస్తు సంభావనమునకాని, సహృదయ
(సుమనసుని) కళాభావనమునందుకాని – ఈ భావపరం
క్రమ విన్యస్తములై వృత్తాకార పరిభ్రమణ రూపచిత్త నివ
కల్గించును.

పైన చూపబడిన మూడంతర్దశలందు మూడును
ములను ప్రయోజనములను నిర్వర్తించును, నిత్య వ్యవహార
ప్రపంచమున గలవైఖరీ వాక్కు ప్రత్యక్షొర్దనిదర్శని, అప్ర
ములను అర్ధములను ప్రత్యక్షముగ ప్రదర్శింపగల్గినది ఫుట
దీని మూలముగనే సంఘమున ఒకరితో ఒకరు సంభాషి
సంభవించుచున్నది. భాషను సామాజికమగు వస్తువుగా బా
వారు కేవల మీ దశయందు వ్యాఖ్యానించువారు ఆధునికమ
శాస్త్రములన్నియు ఈ మొదటి దశయందు తమ పరిశీలన
జరుపును.

కాని ఒక సాహితీ తత్వ శాస్త్రములను వేదాంతమును త
వాక్త్రియమును గూర్చి మీమాంసింపక తప్పదు. అ
గుప్తపాదులను కాశ్మీర శివాద్వయాచార్యుడు ఇట్లని స్తుతించె

ఆసూత్రితానాం భేదానాం స్ఫుటతాపత్తిదాయినీం
త్రిలోచన ప్రియంవందే మధ్యమాం పరమేశ్వరం,
ప్రాజ్యం ప్రోల్లాసమాత్రం స్యాద్యద్భేదేనా మన్త్రితేయ
వందే భినవ గుప్తోహం పశ్యంతీ తమిదంజగత్
యదున్మీలని శక్త్యైవ విశ్వమున్మీలతిక్షణాత్
స్వాత్మాయతన విశ్రాంతాం తాం వందే ప్రతిభాంశివా
(ధ్వన్యాలోకలోచన వ్యాఖ్యపుటలు 520,'17, 164)

పై శ్లోకములు ప్రత్యక్షముగా ఈ వ్యాస ప్రయోజనమును సమర్థించునవి - నిరూపించునవి. మధ్యమ వైఖర్యర్థమును స్ఫుటీకరించునవి. పశ్యంతి సర్వజగత్తునే ఆకారముగా దర్శించు జ్ఞానమూ - కేవలము యోగి గమ్యము. పర ప్రతిభ స్వాత్మాయుతన విశ్రాంతి ఇది స్వాత్మాయతన విశ్రాంతి ఎట్లు?

సా ప్రసూతే కుండలినీ శబ్ద బ్రహ్మమయీ విభుః
శక్తింతతో ధ్వని స్తస్మాన్ నాదస్తస్మాన్ నిరోధికా
తతోర్ధేందు స్తతో బిందు స్తస్మాదా సీత్ పరాతతః
పశ్యంతీ మధ్యమా వాచీ వైఖరీ శబ్దజన్మభూః
(శారదా తిలకుడు)

దీనిని ఉదహరించి సర్ జాన్ ఉడ్రాఫ్ ఇట్లనుచున్నారు.

కుండలిని నుండి శక్తి, శక్తి నుండి ధ్వని అనగా పరా పశ్యంతుల నుండి ధ్వని మార్గమున మధ్య మార్గమును దాటి వాక్ప్రయత్నజమై వైఖరి పుట్టుచున్నది. (షట 226)

కావున మరల కుండలినీ సంయోగమే స్వాత్మాయతన విశ్రాంతి కావున మరల వైఖరి అంతర్నిహితమే అగుచున్నదని అర్థము సత్త్వ రజస్తమోగుణ సమన్వయమును దీనికి నిదర్శనము రజోఽనువిద్ధమగు సాత్త్వికము శబ్దప్రపంచము బయల్వెడలుటకు హేతువు. కావున సత్త్వమునందే పర్యవసానము. ఇది సహజమగు పద్ధతి వ్యక్తము వ్యక్తమున లయించుట అనగా ఇదియే.

యోగి ధ్యానమున పొందు అనుభవమునకు సహృదయుని కళా భావమునకు గల సామ్యమీ వాగ్దశలందే యోగికి - తాపసికి

భేదమున్నది. తాపసి తన భావములను నియమించుకొ
దమన మిచ్చట ప్రధానము. యోగి వ్యక్తా వ్యక్తములను స
యించు కొనును. ఇట దమన క్రియ లేదు. శమనమున్నది.
ప్రశమనమే విశ్రాంతి, బాహ్యా మాభ్యంతరమున విశ్రా
పొందును. అది బాహ్యమగు వస్తువునకు గల సహజశక్తి
స్థైర్యమగు పర్యవసానము వస్తువునకున్న ప్రచేతన శక్తి
ప్రయోజనము కల్గినదే. ప్రచేతనత్వము బాహ్య వస్తువున
అంతరిక ప్రకాశమును చూపగలది కావున స్వాత్మ జ్ఞానము
ముఖముగా పొందింపబడుచున్నది. కావున వస్తువు సమర్చనీ
వాక్కు బాహ్యరూపము నందగల వస్తువు కావున సమర్చనీయ

## వాక్సమర్చనమనగా ఇదియే ఇది సగము

విరాట్స్వరూపమున్నది. అందుభిన్నగోళములు, గోళమున
దేశములు దేశమునభిన్న ప్రాంతములు,భిన్నజనులు, జనుని
భిన్న అవయవములు - అన్నిటను మరల విరాట్స్వరు
సూక్ష్మరూపము నంది ఉన్నాడు. మరల భిన్న గోళములు, గో
భిన్న దేశములు-మరల ఇదే వరుస. అణు పరమాణు సంబంధ
గూర్చి పరిశోధించెడి పండితులిట్లే చెప్పిరి ఇదియే వస్తువున
స్వాత్మ ప్రకాశమనగా, వస్తువు వస్తువుగా నిలవదు. భావమున
వసించి తీరును. భావమును భవమునలయించును. అను
యందు వస్తుభావములు భిన్నములుకావు. ఆ దశయందొ
విమర్శ-దేవీతత్త్వము మరొకవైపు ప్రకాశము-శివ తత్త్వ
స్థూలసూక్ష్మ భేదాత్మక ప్రపంచమంతయు అచ్చట సమన్వ
నొందును. అది కేవలమనుభవము, ఆ అనుభవము ఒక
కాలము జరిగిన వేయి ఏనుగుల సత్తువ, వేయి చక్రవర్తుల ద

కోటి విద్రులతత్త్వము, కోటి అచ్చరల సౌందర్యము ఒక్క సారి ప్రాప్తించును. నిజ జీవితమున కార్య కలాపములకు కావలసిన శక్తి ఏపాటిది?

దానిని సాధించుటకు ప్రయత్నింపవలసిన అవసరముతే బలవంతమున ఇంద్రియములను నియమించుకొనవసరముతే ఈ జగత్తునగల వైవిధ్యమును-అందులోగల చరాచర రమ్య కతను-అందునగల అంతస్సూత్రమును భావింపుము మధ్య పశ్యంతీ ముఖములుగా ఆ అనుభవము ప్రతిభాసమగును. ప్రపంచమునంతయు ఒక చిత్రమువలె సూక్ష్మముగ మార్చి భావనేత్రము ముందుంచును అది తరగి మరి ఒకటి దానిపై ఇం కటి. ఇట్లు లోన సర్వమును నిర్వహించెడి వాగ్దేవియే., ఆమె ఇ ణయే ఇంత భావనమును చేయించు చున్నది.

ఈ భావనకు సమర్థముకాని వానికి వైఖరీ రూపవ మంత్రము పాదేయమగుచున్నది - మంత్రము శబ్దశక్తిని ప్ర ముగ కల్గినదనుటకు సమాధాన మిచ్చుట ఉన్నది. సంగీతమ తన్మయుడై వినువాడీ అనుభవమును పొందగలడు. ఒకొ్క శబ్దమున కొకస్థాయిఉన్నది. అస్థాయి మూలాధారాది భిన్నస్థాన లందొకచో కుదురునది. అచ్చట ఒక విలక్షణమగు స్పందమున ఆ స్పందము ఒక భావ తరంగమును కదల్చును-అది మరి దానిని-ఇట్లు ఆ వృత్తిరూప పరిభ్రమణ మానందమున నిం సందును. ఇది ఎంత సేపు? అది భగవచ్చేష్ట. మనచేత ఉన కాదు. ఒకొ్కకసారి వృత్తి మిక్కిలి చిన్నది. ఒక్కనికే భి మానసిక దైహిక దశలందది భిన్నముగ ఉండును. ఒక్క మిక్కిలి పెద్దది, భిన్న రాగములు భిన్న తాళములు గతులనడ ఎప్పుడో ఆ నిర్వతి. అట్లే మంత్రము నయితము అతః క

ప్రబోధ రూపమగు జ్ఞానమును కల్గించును. మోహావిష్టప
లౌకిక దశనుండి ఈ సాత్మానభాసానందస్థితికి నడుమగల ప్ర
మును నిర్వహించు వస్తువు వాక్కు. ఇది వాక్యము ర్చన
తక్కిన సగము

ఇట్లు వాక్కు వాక్కునే సమర్పించు కొనుచున్నది భా
దేశమున ప్రపంచమున ఈనాడుగల అసమన్వయరూప సిద్ధా
ములకు, వాదములకు, భేదములగు సమన్వయు మీ భావన
కూర్పవలయును, సంపూర్ణత దీని ప్రత్యేకత.

అర్పమగు జీవితమున మానవునికి ప్రకృతిలో తాదా
మున్నది. ఈ సర్వసృష్టిని ఒక వస్తువున భావింపగల Ma
Scopic Understanding తోపాటు కంటికి కనిపించని అణువు
ఈ సర్వసృష్టిని భావింపగల Microscopic Understan
ఉన్నది – ఇదియే ప్రకృతిలో తాదాత్మ్యమనగా గుడి కట్టుదు
మన దేహమునే ఆలయముగ ఎలతుము. ఆత్మస్థానమున దే
ప్రతిష్ఠింతుము. దీనిని గర్భమందుము. తనలో తనను చూ
నుటకు భారతీయుడు మాధ్యమిక (Medium) ముగ వ
నాశ్రయించును. వస్తువు నుండి భావమువైపు ప్రస్థానముచే
టలోవ్యక్తి దేశకాల బద్ధములగు వైయక్తిక దశనుండి సర్వమా
సంపుటిలోని ఐక్యతా సమిష్టి, సూత్రమువైపు పయనించ
శాంతిపాఠ పరనము భారతీయుల విలక్షణత. జగత్తు సంత
జీవరించిన అట్టి మహర్షి వాణియే.

వసుధైక కుటుంబకమ్

అని ఆశంసించగలదు. ఈ విశ్వ భావనా తాదాత్మ్యమ
పెంపొందించుటకే వాగ్దేవి సమర్చనము ప్రధానము. తన
శబ్దములను వినుట నేర్చుకొనినపుడే బయటి శబ్దములను మాన
సరిగా వినగలడు. కావున నీ ప్రయత్నము - వాక్సమర్చనము

# అనుబంధం - 2

## వాగర్థాద్వైతము

ఈ వ్యాసమున వాక్కును గురించి, అర్థముతో దానికి
అవినాభావ సంబంధమును గురించి చర్చింతును.

కాళిదాసుస్తుతి ఒకటి ప్రసిద్ధము వాగర్థా వివసంపృక్తౌ
మరి ఒకచోట ఇతడే "తమర్థమివ భారత్యా" అనియు వ్రాసిన
కవి అగువాడు వాగర్థముల సంపృక్తతను భావించినచో దో
లేదు శాస్త్రకారుడీ విషయమును నిరూపించుటకు మిక్కిలి శ్ర
వలసి యుండును. శ్రమ ఎందులకనగా లోకము బుద్ధికి
హితముగ ఉండునది కావ్యము హృదయ సామీప్యము
లోకము నందలి మనుష్యుడును ఒకొక్కసారి హార్ధికముగ ప్ర
చుటగలదు. కాని లోకమున ఎక్కువ వ్యవహారము బుద్ధితో
బడునది ఈ దృష్టి ఎట్టిదనగా సాధ్యసాధన దృష్టి అనగా
న్నది ఎందులకు - తినుటకు కుళ్ళిపోయినది ఎందులక
పారవేయుట కను సమాధానము కాదు. అచ్చట పుర
సాధనములుగ పండు కుళ్ళుయును కార్యము నెరవేరిన
హేతు హేతు మద్భావమును భావించు వారినే నైయాయి
దురు - అనగా నైయాయికులనబడువారు

(చూ ఆంధ్రపత్రిక ఉగాది సంచిక ఏప్రిల్ 1979)

ఒక నాడుండి ఈనాడు లేరని తాత్పర్యము కాదు ఎ
ను ఉన్నదే ఈ మానసిక దశ. ఇదొక వికల్పము. ఈ వికల్ప
ప్రభావితుడైన వానికి లోకమంతయు సాధ్య సాధన సంబంధ
ముగ కనిపించును.

కాని కవిమాత్ర మానాడును, ఈ నాడును ప్రయత్ని
కాని అప్రయత్నితుడై కాని భావమునకు-వాక్కుకు నడుమ
ర్బాహ్య సంబంధమునే భావించుచున్నాడు. స్థూలముగా వా
ల అద్వైతమనగానిది. అనగా కవి భావిత భావమునే వాగ్రూ
లోకమున కందించుచున్నాడని తాత్పర్యము.

సంగీతకుడున్నాడు. భిన్న స్థాయులలో భిన్నరాగ
రములు చేయును. మంద్రమున-స్వరితమున-తారమున
భావములను స్వ రూపములుగా మార్చును. ఇక్కడ మార్చు
దెవరు? కవి ప్రయత్నమెట్టిది? ఇచ్చటి సంగీతకుని ప్రయ
మెట్టిది?

ఒక కళాకారుడున్నాడు. ఒక చిత్రముగీయును నచ్చ
చించివేయును మరల గీయును, మరల నచ్చదు. చించివేయ
ఒక చిత్రము నచ్చినది. అది మనలో ఒకనికి అర్థములేని గీ
గా కనిపించును, కాని చిత్రకారుడందొక భావమును నిక్షేపిం
ఎవరో ఒకరందురు. ఆ తర్వాత చూతుము. అరే! నిజమే!
కొందుము ఆధునిక చిత్రకళలో ఈ సమస్య మరింతయున్న

కవి, గాయక, చిత్రకారులలో ఇరువురున్నారు, ఒకరు దే
బద్ధుడగు బాహ్యవ్యక్తి, మరొకరు అతనిలోని కళాస్వరూ

అంతరవ్యక్తి ఆ అంతరవ్యక్తి వాగ్రూపమున భావమునందించు వాడు, స్వరములతో భావములు పలికించువాడు కుంచెతో భావములకు రూపు కట్టించువాడు

వాగ్రూపమనగా ఏమి?

నేను అను పదమున్నది - అర్థమును గలదు - ఉత్తమ పురుషైకవచన సర్వనామము. వ్యవహారమున నేను గలదు అర్థము భావింపబడుచున్నది, కావున అంతర్గతమగు ఆ భావముతో "నేను" నిత్య సంబంధమును కల్గి ఉన్నది. ఇది పాఠశాలలో చెప్పుపద్ధతి మామూలుగ వ్యవహారమునందలి వాక్యములలో ఇట్టిదశ చాల స్వల్పము.

ఒకడు వర్షించుచున్నదని చెప్పెను. మరి ఒకడు విని అతిను అనును ఒక నవలలో ఈ వాక్యములు రెండు పాత్రల నడుమ గల అనంత భావములకు సూచకములు కావచ్చును. అమరి ఒకడు వర్షము రాక పోవుటను చూచియు అవుననవచ్చును. ఆ మొదటివాడు వర్షము పడుచున్నదా - లేదా - అను విషయమును గమనింపకయే అట్లనవచ్చును. శ్రోత విననవలయుననికాని వినినను నమ్మవలయునని కాని ఏక్తుకుండనక్కరలేదు. శ్రోతయు వక్త వాక్యమునకు తన సమాధానము గాక, అవహేళనగా అవునన వచ్చును.

ఇంతవరకు చేయబడిన వాదమంతయు బౌద్ధికము అనగా బుద్ధికి సంబంధించినది మొదటి సారిగా నైయాయిక వైశేషిక దర్శనముల ప్రభావము బౌద్ధముపై అనంతముగా పడినది. ఫలితముగ శబ్దమర్థ బోధకము కాదను అపోహ సిద్ధాంతము బయలు దేరినది. వీరి దృష్టితో వ్యవహారమునందలి పదమసత్యం అర్థాపోహకము మాత్రమే.

తరువాతి శాంకరము దీనిని అంగీకరించుచు వా
సత్యత్వమును అంగీకరింపక తప్పినది కాదు. అద్వైతసి
దేశమున చిలువలు పలువలుగ ప్రాకిపోయిన దశలో
వాక్యపదీయము ఆనందవర్ధనుని ధ్వన్యాలోకము,
లోచనము మహిముని వ్యక్తివివేకం, కుంతకుని వక్రోక్తి
శబ్దార్థములను గూర్చి విశిష్ట సిద్ధాంతములను ప్రతిపాది

శ్రీ శంకరుని వైదికమత స్థాపమున అంతర్గతము
ములఅద్వైత భావన ఉన్నది. దేవీంవాచమ జనయ
ఇత్యాది ఋక్కులు వాక్కును దేవీస్వరూపముగ చెప్పిన
ప్రాథమికముగ జ్ఞానవాదము చేసిన శంకరుడుకాని-తడన
డు భర్తృహరికాని-వాక్కు"ను "శబ్దబ్రహ్మ"ముగా తలప
దికాదు. తప్పినది కాదనగా వారును వాక్తత్త్వముగల
గుర్తించిరని అర్థము-చత్వారివాక్పరిమితా పదానీత్యాది ని
వారువైఖరి-మధ్యను-పశ్యంతులకు మాత్రము పరిమిత
శబ్దబ్రహ్మముగా తురీయదశను భావించిరి. అనాది నిధనం
ఇత్యాదివాక్యపదీయకారికలు నిదర్శనములు ఇచ్చట గ
ద్వైతమునకు-శబ్దార్థములు భిన్నములుకావు-అనుట తాత్ప

శ్రీ శంకరులు దక్షిణామూర్తి స్తవమున 'నానాచ్ఛి
ద్రేత్యాది శ్లోకమున జ్ఞాన స్వరూపునిగా బ్రహ్మమును
ద్వారమున బహిర్గతుడగుచున్నవానిగా స్తుతించిరి. ఇంద్రి
చిల్లుల ద్వారమున బహిర్గతమగుచున్నది. ఇది యోగ ప
శము [ఘటప్రదీప న్యాయమని పరిభాష. గీత చిత్రము
లేకున్నను బహిర్గతమగు భావమే అర్థ స్థానమునందు
కావ్యమునకు ఇదే చెల్లును.]

శ్రీ శంకరుల కాశ్మీర ప్రయాణము అద్వైతమున ఘ
ఘ్యోక చిటారు కొమ్మనచేరుట. అది కాశ్మీర శివాద్వయవాదము
ప్రభవించినది. శాక్తవాదమిది. శివుడును శక్తిమంతుడైనపుడే క
లిక. లేనిచో స్థాణువు, భారతీదేవి శంకరుని వెంబడి ధక్షిణదిశ
పయనించినదన్న చరిత్రకేతి వృత్తమున తాత్త్వికార్థమిది. నిర్గు
మగు జ్ఞానవాదము సద్గుణమైనది, శక్తి శక్తిమంత్తినితో అవి
భావిత కల్గినదిగా గుర్తింపడినది.

శివశ్శక్త్యా యుక్తోయది భవతి శక్తః ప్రభవితుం" అ
శ్రీశంకరులే దేవిని స్తుతింపక తప్పినదికాదు. వాగర్థముల అద్వై
తమును గుర్తించుటకిది మొదలు. ఇచ్చటగల అద్వైతము-ఒ
దానిని వదిలి మరియొకటుండదనుట.

సోమానందునితో "పరా"వాక్స్వరూపము గుర్తింపబడిన
పరా పశ్యంతులను భవదశలో అభిన్నములు. వ్యక్తదశలో పర
శ్యంతిగా మారును. మధ్యమా మార్గమున వైఖరీరూపమునందున
మరల స్ఫురణానుభవమున పరతో నైక్యమగును. ఇట్లుసర్వసృష్టి
వాఙ్మయముగ భావించుటతో జగత్సృష్టికిని, వాగ్వ్యక్తికిని, ఒ
సమన్వయము కుదిరినది. దీనితో తార్కిక వాదముల నోళ
మూయబడినవి.

"వాక్కు" అనుటతోడనే వ్యక్తమయినదని అర్థము. అనగ
బహిర్గతమైనదని. వ్యక్తమగునది మరియొకదానినిస్ఫురింప జేయ
ను. ప్రచేతయతి" అని వాగ్ధర్మముగా ఋగ్వేదము ఏనాడో చెపి
నది. "స్ఫురణ" తర్క మీమాంసాదులకు లొంగునది కాదు కే
లము దివ్యమగు లక్షణము. అనగా మానవ ప్రయత్నముం

అనుమంతయు లేదు. ప్రయత్నమనగా బుద్ధితో చేయబడ
"హృదయము" స్వాతంత్ర్యము కల్గినది. చిత్త వికల్ప
కార్మాను బద్ధములు. హృదయమాత్మ ప్రకాశనస్థానము. శ
హృదయస్థుడని భగవద్గీత కావ్యగాయన లేఖనములందలి
స్ఫురణ హృదయమున కల్గు కదలిక. స్పందము, కావుననే కా
శివాద్వయవాదు లందరును ప్రత్యభిజ్ఞ-స్పంద - సూత్ర
నాధారముగ అలంకారిక దర్శనము గావించిరి. అది ప్రత్యేక
పరిశీలింపదగినది.

మొదటిసారిగ శబ్దార్థముల నడుమగల ఈ వ్యక్త
సంబధమును నిరూపించిన వాడు ఆనందవర్ధనుడు, తత్త్వాలోక
గ్రంథమున ఆనందవర్ధనుడే లోకమవిద్యామార్గమున నుం
దనియు, భర్తృహర్యాదులు ప్రతిపాదించినశబ్దము బ్రహ్మ
వాదము కేవలము వ్యవహార మార్గోత్తీర్ణులైన వారికే చెల్లుననిం
వ్యవహారమున శబ్దార్థముల అవినాభావిత నంగీకరింపక
దనియు ప్రతిపాదించినాడు. ధన్యాలోకమున నీసూత్రము
ఘట ప్రదీపన్యాయము వాడు కొనబడినది. ఒక వాక్యమ
వాచ్యార్థముతో పాటు అర్థాంతర ప్రతీతి ఉండుట గలదు
అర్థానంత్యము ఒకే వాక్యమునకెట్లు సాధ్యము? ఎట్లనగా
ఆత్మ పదార్థము భిన్న ఇంద్రియముల ద్వారమున బ
మగునట్లు

ఈ అర్థాంతరము లేమి చేయుచున్నవి? ఒక అర్థము
యొక దానితో కలసి - అప్రధానమై - ప్రధానమై ఒకే అర్థ
వ్యక్తీకరించుచున్నది. అనగా "కవి" అనబడు బాహ్యవ్యక్తి
చెడి ప్రక్రియలు కావివి. అంతరవ్యక్తికి స్ఫురణావేశము చేత
ల్పడలు శబ్దార్థములు ఏకైకమగు భావమును భిన్న రీ
వ్యక్తీకరించుచున్నవని అర్థము.

ఇట్లు బయటపడిన శబ్దార్థముల తత్త్వము - భావము ఎ
గోచరమగును? మరల ఆ స్ఫురణానుభవమున్నవానికి. జే

సహృదయుడనిరి. ఇది ఒక చిత్రమగుమాట - అట్టి హృదయవ
కలవాడనియు (మంచి) హృదయము కలవాడని అనగా ప్రప
చము నందలి ఇంత వైవిధ్యమున కొన్ని జాతులు (types) మా
మున్నవి - అని పాశ్చాత్య మానసిక తత్త్వవేత్తలు చెప్పుచున్న
సత్త్వరజస్తమో విభాగము నాశ్రయించి భగవంతుడు కార
కార్యముల నిర్దేశించినట్లు - నవరసములని - 8 సాత్త్వికభావ
లని, 33 వ్యభిచారులని - ఆలంకారికులు దర్శించునట్లు - హృద
సామ్యము ప్రపంచమున ఉన్నది, ఇట్లే ఒకదేశపు కళను మరి ఒక
భాషా పరిధులను దాటి - మెచ్చుకొనుట సంభవించుచున్నది.
విశ్వ జనీన భావములన్నియు భిన్న శబ్దరూపములనందు ఉన్న
అందుటలో వైవిధ్యమున్నను ఆ శబ్దములతో యోగము
ఉన్నవి.

శబ్దము స్మృతిరూప ప్రభావమును చూపుట - శబ్దము కొ
వినబడియు పూర్తి రూపము గ్రాహ్యమగుట - తన భాషయం
ప్రతి ఒకనికి "జాత్యన్న"మునందువలె రుచి యుండుట -
శబ్దార్థ నిత్యత్త్వమునకు బాహ్యములగు నిరూపణములు పైనచే
చర్చ తాత్త్విక నిరూపణము

తంత్రాలోకమునను పరాత్రింశిక వివరణమునను
నవులు వాక్చతుష్టయ నిరూపణము చేసిరి. అవి వేరుగ చూడ
నవి, అన్నిటను గల ప్రధాన సూత్రము వాగ్రూపయగు భగ
శబ్దార్థముల రూపమున లోకావతరణము సేయు చున్నదన
ఇట్లూహించుటలో సౌందర్యమున్నది. శబ్దార్థ దాంపత్యమున
లోచనము సరస్వతీ స్వాదుత దర్థవస్తు త్యాది ధ్వన్యా
శ్లోకమునకు వ్యాఖ్యానము చేయుటలోను వ్యంజనాశక్తిని ని
చించుట లోను దీనినే పాటించినది.

మహిమభట్టు పరావాఙ్మయసాక్షాత్కారము చేసినవాడే. కాని బౌ
మగు వాదము చేసెను వ్యక్తిస్ఫురణకు సంబంధించి ఉండగా –
శబ్దార్థములను మరల సాధ్య సాధన దృష్టితో విమర్శించి తీ
ముగా విమర్శింపబడెను. శబ్దము అర్థగమకము అర్థాంతరమున
మీయమానము తప్ప వ్యంగ్యము కాదని అతని వాదము.

ఒక కుంతకుడు అలంకారికులలో విలక్షణవాదము చేసి
వాడు పరావాక్పరి స్పందరూపములే ఇతరములు కా
శబ్దార్థములు వాచక వాచ్య సంబంధము కల్గినవని ఇత
వాదము – ఒకనాడు అభిధావాదులును ఇట్లే వాచ్య వాచక సంబ
ధవాదము చేసిరి. కాని కుంతకునికి మరియొక విలక్షణ సూత్రము
న్నది. అది శబ్దార్థముల స్పర్ధ. వ్యవహారమున శబ్దమర్థముతోను
అర్థము శబ్దముతోను పోటీపడి భాషాగతి నిశ్చితమగుచున్నది–ఇద
కావ్యమున–అనగా శబ్దార్థములు రెండును వాచకములే–అనిర్వాచ్య
మగు రసమునకు !

పై వ్యాసమునందలి ప్రధానాంశములను సమీక్షించినచో
శబ్దార్థాద్వైతము భిన్న దృష్టులతో భావింపబడిన దనుట స్పష్టమ
గును. వ్యవహారమున శబ్దార్థములు సాధ్య సాధన భావము కల్గిన
చోట్లున్నవి. కాని కావ్యమున మాత్రము భావమునకు శబ్దార్థములు
వ్యక్త రూపములు. పరస్పరమచట వాచ్య వాచకములయినను–
సూచకములు కావు : వ్యంజకములే.

ఈ సంశ్లిష్టతనిట్లు గుర్తించవచ్చు

$$\frac{\text{వాక్కు} = (\text{శబ్దము} + \text{అర్థము})}{\text{భావము} \quad (\text{అర్థము}) = \text{రసము}}$$

ఈ కుమార విద్యా స్వరూపమేమిః రాజమహేంద్రవరం నుండి విశాఖపట్టణం వరకు ఉన్న భూభాగంలో ఏనాడో ఒకనాడు కుమారవిద్యా సంప్రదాయం ప్రచలితం కాకపోతే నన్నయ ఈమాట వాడడు. కాని ఇంతవరకు భారతం మీద పరిశోధించినవారు కుమారస్వరూపం ఇది అని నిరూపించలేదు.

కుమారస్వామి జన్మను వివరించటం ద్వారా కుమారవిద్యా స్వరూపాన్ని కొంతవరకు అర్థం చేసుకోవడానికి అవకాశం ఉంది. ఆ ప్రయత్నం ఈ వ్యాసంలో జరుగుతుంది.

<u>వైదిక వాఙ్మయంలో కుమారుని ప్రసక్తి :</u>

ఋగ్వేదంలోని ఈ క్రింది మంత్రం "స్కంద" పరంగా అన్వయం కల్గిందని కృష్ణభిక్షు పండితుని నిరూపణం :

*వృషా జజాన వృషణం రణాయ*
*తం ఉ చిన్నారీ నర్యం ససూవ*
*ప్రయః సేనానీ రధ నృభ్యో అ*
*స్తైనః సత్వా గవేషణః సధృష్ణుః*

(విజ్ఞానదాయకుడైన (వృషా) శివుడు, యుద్ధం చెయ్యడంకోసం అగ్ని జ్వాలను వర్షించే (వృషణం) సేనాపతిని, సిద్ధపురుష నేతను (నర్యం) దేవతల కోసం పుట్టించాడు, చిచ్ఛక్తి కుండలిని ఆయన మాత. ఆయన ప్రభువు. సత్వశక్తిమంతుడు. సర్వాన్నీ పరిశీలించేవాడు. శత్రువిజేత (ధృష్ణుః) [చూ. "స్కందదేవుడు" అన్న నా వ్యాసం] *

వైదిక శబ్దాలు ప్రతీకామయంగా ఉంటాయి. శివుడు వర్షించింది ఆత్మజ్ఞానాన్ని అదే విజ్ఞానమనబడింది. ఆ'వర్ష' ప్రతీకగా వృషభుడని శివుడనబడ్డాడు. తమస్సుతో శివాంశచేసిన యుద్ధమే అగ్నిజ్వాలను వర్షించటం. "వృషణ శబ్దం కుమారుని హస్తగతమైన కుంతాయుధాన్ని సూచిస్తుంది. అది అగ్నిని వర్షించింది. ఈఅగ్ని చిదగ్ని. చిత్ + నారీ = చిన్నారీ = కుండలినీ రూపమైన చిచ్ఛక్తి -"శక్తి" ఆయన తల్లి.

* "ఆరాధన" (మన్మథ. ఆషాఢ : 10-11) చూ. ఆచార్య తమ్మారెడ్డి నిర్మల "నన్నెచోడదేవకుమారసంభవ పరిశీలనము" (1989:112)

ఆయన శివుని కన్నా వేరుకాడు. ఆయనే పుత్రునిగా అవతరిం
(ఆత్మావై పుత్రనామాసి). ఆయన సుబ్రహ్మణ్యుడయ్యాడు.

"వాగ్వై బ్రహ్మచ సుబ్రహ్మచ"

అన్న ఋక్కు వాక్కునే సుబ్రహ్మణ్య స్వరూపంగా చెబుతోంది.
శివశక్తి కలయిక చేత "వాక్కు" ప్రభవించింది. ఎలా అంటే

"అగ్నిర్వాగ్భూత్వా ముఖం ప్రావిశత్"

అగ్ని వాక్కుగా మారి ముఖాన్ని ప్రవేశించింది. అజ్ఞానమనే చీ
పారద్రోలగల్గిన సుశబ్దమే ఆ "అగ్ని". ఋగ్వేదం అగ్ని ఉపా
స్తోత్రంతో ప్రారంభం కావటంలోని పొగసు ఇదే.

ఇది కుమారస్వామి జన్మను వైదిక మహర్షి సంకేతించిన
ఇక్కడ యోగంయుద్ధంగా సంకేతించబడి స్కందుడు సేనానిగా ల
బడ్డాడు. భగవద్గీతలో "సేనానీ నామహః స్కందః" (10-24)
చెప్పడం ఈ వైదికనేపథ్యంతోనే.

వామన పురాణం :

ఈశ్వరుని తేజస్సును అగ్ని, గంగ భరించటంవల్ల రెల్లువ
(శరవణం) కుమారస్వామి జన్మించి శివపార్వతులను చేరాడు.

స్కంద పురాణం

పార్వతీ పరమేశ్వరులు మందరపర్వత సానువుల్లో విహరిస్తు
మహాదేవుడు తన దేవిని కూడా మోసగించి తన తేజస్సును పవిత్ర
ఘృతరూపంలో అగ్నిలో నిక్షేపించాడు. అగ్ని దానిని గంగాదుల్లో
పెట్టగా, స్వాహాదేవి కృత్తికారూపంలో తన భర్త (అగ్ని) తో రహ
అక్కడక్కడా చెదరి పడివున్న శివతేజాన్ని ఒక్కచోట సంగ్రహి
మేరు పర్వత సానువుల్లోని శరవణంలో చేర్చిన చాలాకాలానికి కుమా
పుట్టాడు. అప్పుడు దేవతలు ఉమాశంకరులు వచ్చి కుమారుని ము
స్వీకరించారు.

శివపురాణం

శివుని రేతస్సు అగ్ని, ఋషిపత్నులవల్ల గంగానదిని చేరి
వణంలో కార్తికేయుడు పుట్టాడు.

మహాభారతం

అగ్ని సప్తమహర్షుల భార్యల్ని మోహించాడు. దీన్ని స్వాహాదే గుర్తించి అరుంధతి తప్ప తక్కిన పత్నుల రూపాలు దాల్చి అగ్నిని సుఖించి శేతో బిందువుల్ని ధరించి శ్వేతపర్వతంలో రెల్లుగడ్డిపై ఉంచి ఒకో బంగారు కుండలో తనభర్త వీర్యాన్ని ఉంచింది. అంతకుముందు రుద్రుడు అగ్నిని పొంది ఉండటంవల్ల కుమారుడు ఆ అగ్ని తేజసు వల్ల పుట్టాడు. అతనికి విశ్వామిత్రుడు జాతకర్మాది విధులు చేశాడు ఇంద్రుడు దేవతల ప్రోత్సాహంతో సప్తమాతృకల్ని కుమారుని వధించ నాని పంపాడు. వారు వచ్చి కుమారుని తేజో విశేషానికి భయపడి కుమ రుని శరణుజొచ్చారు.

కాళిదాసు "కుమార సంభవం" :

శివ పార్వతులు సంయోగంలో ఉన్న ఇంటిలోకి ఒకపావురం చేరింది. శివుడికి దాన్ని చూసి ముచ్చట వేసింది. కాని త్వరలోనే శివుడు పావురం రూపంలో ఉన్నది అగ్నిదేవుడని గుర్తించాడు శివుడు శపిస్తాడని భయపడి అగ్ని తాను వచ్చినపని చెప్పాడు. ఇది దేవతా కార్యమన్నాడు. "మీతేజస్సుతో దేవసేవకు పతికాగల ఒకమహ వీరుణ్ణి ప్రసాదించి తారకుని బాధలనుంచి విముక్తి కల్గించ"మనికోరాడు ఊర్ధ్వరేతస్కుడైన శివుడు సంయోగాంతంలో స్ఖలించిన తన మహ వీర్యాన్ని అగ్నికి ప్రదానం చేశాడు. అగ్ని ఆ వీర్యాగ్నిచేత నల్లగా మాడిపోయాడు. ఇంద్రాదులు చెప్పగా గంగలో స్నానం చేశాడు. శివ వీర్యం గంగలోకి ప్రవేశించింది. ఇక గంగ ఉడకటం మొదలుపెట్టింది ఒకరోజు మాఘమాసంలో సూర్యోదయ సమయంలో షట్కృత్తికలు స్నానం కోసం గంగానదీ తీరానికి వచ్చారు. గంగకు నమస్కరించారు. గంగలో స్నానం చేశారు. శివతేజస్సు వారిలో ప్రవేశించింది. వారిలో పిండాకృతి దాల్చింది, బుద్ధిమతులైన కృత్తికలు తాము గర్భవతు లయ్యామని గుర్తించారు. పతులకు భయపడ్డారు. వ్యాకులచిత్త లయ్యారు. కాని అందరూ కలిసి ఆ గర్భాన్ని జాగ్రత్తగా రక్షించారు, రెల్లువనంలో తమ గర్భాలను వదలివేసి తమతమ ఇళ్ళకు వెళ్ళిపోయారు ఫలితంగా ఆరుముఖాలతో కూడిన ఆ బాలుడు అలా పుట్టాడు.

ఇంద్రాదులు మరలా వచ్చి గంగాదేవిని ప్రార్థించారు. ప్రార్థనను అంగీకరించి గంగ ఆ బాలుణ్ణి పోషించింది. కృత్తి వచ్చి ఆ బాలున్ని సాకారు. ఆ శిశువునుచూసి అగ్ని, గంగ, కృత్తి సంతోషపడ్డారు, ఇంతలో శివ పార్వతులు అక్కడికి చేరారు. కుమారున్ని కైలాసానికి తీసుకువెళ్ళారు. పుత్రోత్సవం జరిప ఆరురోజుల్లో ఆ బాలుడు మహావీరు డయ్యాడు. తారకునితో యుద్ధ తలపడ్డాడు.

కుమారుడు తారకునితో యుద్ధం ఎలా చేశాడో చెబుతూ కాళిద ఇలా వర్ణించాడు.

*దేవోఽపి దైత్యో విశిఖ ప్రకారం స చాపం*
*శాఖైశ్చ కర్తకణశోరణ కేళికారి*
*యోగీవ యోగ విధి పక్షమనాః యమాద్యైః*
*సాంసారికం విషయ సంఘ మమోఘ వీర్యమ్.*

(కార్తికేయుడు ఆ రాక్షసుని ధనుర్బాణాలను చాలా అవలీ ముక్కలు గావించి పారవేశాడు. అమోఘ వీర్యుడైన యోగి య నియమాదులచేత తనమనస్సులోని సాంసారిక విషయ వాంఛ జయించినట్టున్నదట)

కుమారవిద్య అంటే 'యోగ" మనటానికి ఇక్కడ నిరూప ఉంది. సంసారం బంధహేతువు కాబట్టి యమ నియమాదుల అష్టాంగయోగసాధన చేయటమే కుమారవిద్య అని ఈ ఉపమానా వెనుకఉన్న అర్థంగా చెప్పవచ్చు.

<u>కుమారతంత్రం</u> : సుబ్రహ్మణ్య తత్త్వంలోని "బాల' భావన అవికారమైన సాధకుని చిత్తవృత్తికి నిదర్శనం కావచ్చు. జాగరూక భిన్నమైన "కోడి" కుమారుని వాహనమని దాక్షిణాత్యులు భావించ లోనూ ఈ యోగవిద్యా నేపథ్యమే కనిపిస్తోంది.

విషయవాంఛా కలయితమైన రంగురంగుల కలగా జీవితా సాధకులు దర్శించి దాన్ని జయించడానికి ప్రయత్నిస్తారు. "మయూర" వాహనంగా చెప్పవచ్చు.

"కౌపీన" వసనుడుగా సుబ్రహ్మణ్యుడు చిత్రింపబడటంలో కూడా ఈ సన్న్యాస లక్షణమే ఉంది. ఈ దిగంబరత్వం సర్వవాంఛా పరిన్యాసానికి నిదర్శనం.

కుమారస్వామికి అర్పణగా మోసే 'కావళ్ళు"కూడా సుఖదుఃఖాత్మకమైన సంసార బంధానికి ప్రతీకే. దాన్ని మోస్తూ యోగమూర్తిఅయిన సుబ్రహ్మణ్యుని పేరిట పాటలు పాడుతూ నృత్యాలు చేస్తారు ఆత్మాహంసారూపమైన నానా దీక్షలతో స్వామిని ఆరాధిస్తారు.

కృత్తికానక్షత్రం కుమారస్వామికి ప్రత్యేకం అది అగ్ని అంశ కల్గిన నక్షత్రం. కృత్తికలు పాలించారు. కాబట్టి కార్తికేయుడయ్యాడని కథ.

అగ్ని అంటే యోగభాషలో తపస్సు తపింపచేయటం అంటే కాల్చటమే. కామమోహాది దుర్గుణాంధకారాల్ని ఆత్మజ్ఞానదీపంతో పారదోలటమే ఈ దహనక్రియ,

"తారక" మంటే మోక్షం, కశ్యప ప్రజాపతి పెట్టిన పేరు. ఈ రాక్షసుని విషయంలో సంపూర్ణంగా వ్యతిరేకార్థక మయ్యింది. 'తారక" అంటే నక్షత్రం. అది స్వప్రకాశం కల్గింది. తారకాసురుడిలో ఇది తిరగబడి వాడు ఆత్మజ్ఞాన శూన్యుడయ్యాడు. ఈ అర్థంలోనే వాడిని "మహిషాసురు" డన్నారు కూడా, కొన్ని పురాణాలలో "మహిష" రూపంతో ఉన్నట్టు చెప్పబడింది. అంచేత ఆ "నల్లదనం" కూడా ఆత్మజ్ఞాన శూన్యతకు నిదర్శనమే

అంచేత శివపార్వతుల సంయోగం ప్రతీకాత్మకమైన శివశక్తుల యోగమే తప్ప దేహాల కలయిక కాదు. ప్రకాశ విమర్శాంశలు రెండూ కలిసిన ఆ పరతత్త్వ స్వరూపం సంకల్పిస్తే సృష్టి వికాసం ఉపసంహరించుకొని లోపలికి మునిగితే ప్రళయం, వినాశం.

తారకుడు దేహబుద్ధి గలవాడు. అంచేతే తనను నియంత్రించే ఆత్మ ఒకటుందన్న "సత్య" స్పృహను కోల్పోయాడు. విజృంభించాడు. అప్పుడు కుండలినీరూపమైన చిచ్ఛక్తి సంకల్పించి ప్రయోగించిన అగ్నియాస్త్రమే "కుమారుడు". వాడు పుట్టగానే సత్యప్రకాశం నలుదిశలా వ్యాపించింది. అజ్ఞాన తమస్సు అడగిపోయింది.

అందుకే ఆరురోజుల్లో శిశువు పెరిగి పెద్దవాడై జీవ సేనాపతి పోయాడని కథ. షట్క్రమల సాధనకు ప్రతీకాత్మకకల్పనమే షణ ఆరు ముఖాలు, ఇప్పుడు చెప్పిన ఆరు రోజులు.

కుమారీ వాక్కు :-

*యచ్చ్కుమారీ మంత్రయతే యద్యోషి ద్యత్పతివ్రతా*

*అరిష్టం యత్కించ క్రియతే అగ్నిస్తదనువేధతే* (కాఠక కావి

అన్న శ్రుతి ప్రమాణం ఆధారంగా పరావాగ్ దేవతకు ఏ కారణ మూలాధారంలో మంద్రస్వరం కల్గిందో ఆ కారణం చేతనే "కు అని పిలువబడుతోందని అర్థం చేసుకోవచ్చు.

దీన్నిబట్టి పశ్యంతీ రూపమైన యోగి వాక్కును కుమారీనా తాంత్రికులు సంకేతించారని తెలుస్తోంది. కుమారసంభవ కథలో రుడు జన్మించినట్టు చెప్పినా కాళిదాసు కాలానికే ఇతిహాస కథారూ పొంది పౌరాణికుల నోళ్ళలో నానిపోయిన ఒక వైదిక రహస్యం క నాథలో మిగిలి ఉందని చెప్పవచ్చు అదే శబ్దయోగం.

తారక శబ్దానికి ముక్తి తిరగబడిన అర్థం. దాటడం వాచా శబ్దోపాసనలో అర్థాన్ని తిరగవేసిచూసుకోవాలి. యోగి సాధనక్రమ ఇలా శబ్దాన్ని లోపలికి మునిగి దర్శిస్తాడు. ఈ దర్శనమే పశ్యం

తేజోరూపాలైన శివపార్వతులకు పాంచభౌతిక శరీర స సంబంధంలేదు. అందుకే ప్రకృతి ఆపని నిర్వహించింది. అగ్ని- శరవణం సప్తమాతృకలు కృత్తికలు వీరంతా ప్రకృతి శక్తులే. శివతేజానికి రూపమిచ్చారు. అలాంటి శిశువును జగత్పితరులు చూ (పశ్యంతి).

## కుమార భారతి - శబ్దయోగ సమన్వయం

ఆచార్య తుమ్మపూడి కోటీశ్వరరావుగారు 1962ప్రాంతంలో క భారతి అనే కావ్యాన్ని రచించారు. నిర్వచనంగా సాగిన ఆరు ఆ లున్న ఈ కావ్యంలో కుమారవిద్య సమగ్రంగా దర్శించబడింది.

ఇంతవరకు చూపిన కుమారనాథలోని అంతస్తత్వ దృష్టితో కథలో శివుడు-పార్వతి-అగ్ని-గంగ-సప్తమాతృకలు, కృత్తికలు పాత్రలు తప్పకుండా రావాలి. కాళిదాసులో కాని తెలుగులో ప్ర 12వ శతాబ్దంలో కుమార సంభవాన్ని ప్రబంధ

తీర్చిన నన్నెచోడునిలోకాని ఈకథలో చెప్పుకోదగిన కొత్త అంశాలు లే
కాని కథను "తారకాసుర సంహారం" దిశగా నడిపిస్తూ కుమారుని అభ్యు
దయాన్ని వర్ణించడమే అటు కాళిదాసుకుకాని నన్నెచోడునికికాని ప్రధా
ధ్యేయం అయింది. అలారాసినా నన్నెచోడునిలో కూడా కుమారసంభ
కథలో ఏదో ఒక "యోగతంత్రం' ఉందన్న స్ఫృహఉంది. నన్నె
చోడుడు ఇలారాశాడు.

మూడోరోజు యుద్ధం జరుగుతుండగా తారకుడు దేవతలపై నా
విధాలైన మాయాప్రయోగాలు చేశాడు. కుమారుడు పరమేశ్వర ప్రద
మయిన దివ్యశక్తిని అభిమంత్రించి ఎత్తున్నాడు.

*దనుజేంద్రు మాయలన్నియుఁ*
*ద్రినయన సుతశక్తిఁగని యదృశ్యత్వం బయ్యెన్*
*వినుతాత్మ జ్ఞానంబునఁ*
*దనరు మహామాయ సెడు విధంబునుఁ బోలెన్.*

(కు. సం. 12-185)

కుమారతంత్రం "ఆత్మజ్ఞాన దర్శనం" అని ఇంతవరకు చెప్పి
దానికి అనుగుణంగానే ఈవర్ణన ఉంది. అందుకే శక్తిని ప్రయోగిం
గానే "మాయ" నశించింది. కాబట్టి ఆత్మజ్ఞాన శూన్యుడే "తారకు
డని అర్థం

ఆచార్య కోటేశ్వరరావుగారికి ముందు వారి సాహిత్య గురు
గారైన కీ శే. విశ్వనాథ సత్యనారాయణగారుకూడా శ్రీకుమారాభ్యుదయ
మనేపేరిట ఒక ఉత్తమ కావ్యాన్ని రచించి ఉన్నారు. వారు కుమారు
కథను గ్రామీణ సంస్కృతికి- పట్టణ నాగరికతకు నడుమ ఉన్న
సంఘర్షణగా చిత్రించారు. గ్రామీణ జీవితం యోగభూమిక కల్గింద
అందుకే దైవాన్ని గ్రామీణులు సంసార సాగర తరణ హేతువుగ
భావిస్తారు. మంచి చెడులన్నిటిని దైవంలో సమర్పించి జీవితాని
సాక్షీభూతులుగా చూస్తారు. భగవంతుడు వారికి సర్వసమర్థుడు.

అలాకాకుండా పట్టణ నాగరికుడు దైవం ఉనికిని తర్కంతో ఆల
చించి ప్రశ్నిస్తాడు సంసారం తాను సృష్టించుకొన్నది. కాబట్టి దా
నిర్వహణలో తనదే బాధ్యత అని భావిస్తాడు. అంచేత సమస్యల్ని త

శక్తితో పరిష్కరించుకోవడానికి ప్రయత్నిస్తాడు వారి దృష్టిలో దై
కేవలం ఒక "భావన", ఒక "నమ్మకం". శాస్త్రీయమైన పునాది
"కల్పన".

ఈ నేపథ్యంలో సత్యనారాయణగారు కుమారస్వామి తన యో
విద్యచేత జగత్తును ఎలా ఉద్ధరించాడో ఇలా వర్ణించారు:

తన యోగవిద్యచేతను
జన్మములదగు వ్యాధి మాన్పి జగతికి యోగా
సన విద్యయు వ్యాధినిరా
సన హేతువటంచు గావి స్వామియు ననగా

జనాలవ్యాధిని తన యోగవిద్యతో బాపినాడట మందు మాకు
లొంగని మహావ్యాధులుకూడా "యోగాసనవిద్య"కు లొంగుతాం
నిరూపించాడట.

ఇలా కుమారుడు భిషక్వరులకు "భిషక్కు"గా చెప్పబడ్డా
వైద్యం అంటే మణి మంత్రాలతోపాటు ఔషధంకూడా సేవించడం
ప్రాచీన దర్శనం. ఇక్కడ యోగం (మంత్రం) భాగమైన "ఆసన
ప్రస్తావించబడింది.

యోగంలో యమ, నియమ, ఆసన ప్రాణాయామ, ప్రత్యాహా
ధారణ, ధ్యాన, సమాధులు - అష్టాంగాలు. యోగి అవలంబించే
భంగిమను ఆసనమంటాం. సింహ, మయూర, కుక్కుటాదులు భ
మలే. అవే వాహనాలుగా కాలక్రమంలో పరిగణింపబడ్డాయి.

కుమారస్వామి సతతోత్థితుడు. యోగం సిద్ధిపొందిన శివపార్వ
శక్తి స్వరూపుడు. అందుకే కుమారుని ఆసనమంటే అష్టాంగయో
సిద్ధించడానికి సాధకులు అవలంబించే భంగిమలన్నీ అర్థం.

ఈ నేపథ్యమంతా తెలిసిన ఆచార్య తుమ్మపూడివారు కుమారశ
వాగుత్పత్తికి సంబంధించిన శబ్దయోగంగా నిరూపించదలచి "కుమ
భారతి" అని పేరుపెట్టారు. ఆకవికి దీక్షానామం కూడా అదే కావట
శబ్దయోగంగా ఈ కావ్యాన్ని దర్శించగలుగుతున్నాం.

## అనుబంధం - 5

# నాదయోగం

సరస్వతికి రెండు ప్రవంతి రూపాలున్నాయి. ఒకటి ఇంతవరకు వివరించిన సాహిత్యరూపం. ఇంకోటి ఇప్పుడు ప్రస్తావించే సంగీతరూపం "సంగీతమపిసాహిత్యం సరస్వత్యా స్తనద్వయమ్' అన్న ప్రాచీనులు సంగీతాన్ని ఆపాతమధురమని, సాహిత్యాన్ని అలోచనా మృతమని చక్కగా గుర్తించారు. ఇంతవరకు చర్చించిన శబ్దయోగాన్ని గురించి ఎరగటానికి కొంత శిక్షణ, అభ్యాసం ఇత్యాదులు అవసరం. కాని సంగీతానుభవాన్ని పొందటానికి ఏ శిక్షణ అక్కరలేదు.

"శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి గానరసం ఫణిః" అన్న మాటలో శిశువులు, పశువులు, సర్పాలవంటి సరీసృపాలు, కోకిల, నెమలి వంటి పక్షులు అన్నీ నాదగుణాన్ని ఆస్వాదిస్తాయన్న అర్థం ఇమిడి ఉంది. అందుకే సప్తస్వరాలు ఆయా జంతు పక్షుల స్థాయీభేదాల నాధారంగా పుట్టాయని సంగీతశాస్త్రం చెప్పడం ఉంది. షడ్జం నెమలిని, రిషభం ఎద్దును - ఇలా అనుకరిస్తాయని గుర్తించారు.

సంగీతజ్ఞుడు ప్రపంచమంతటా వ్యాపించిఉన్న నాదాన్ని ఉపాసిస్తాడు. ప్రణవ స్వరూపమైన ఓంకారాన్ని వేదాంతులుపాసించగా ఆఓంకారాని కంతర్గతంగా ఉన్న నాదాన్ని సంగీతజ్ఞులు ఉపాసిస్తారు. నాదోపాసనకూడా ఒక యోగసాధనే. ఎందుకంటే నాదోత్పత్తి ఒక భౌతిక ప్రక్రియ మంత్రమేకాదు. చైతన్య ఆవిష్కృతి నాదరూపంగా ఎలా జరుగుతుందో త్యాగరాజస్వామి ఇలా కీర్తించారు.

> "ప్రాణానల సంయోగమువల్ల - ప్రణవనాదము సప్తస్వరముల బరగె" నన్నారాయన.

ప్రాణవాయువు చైతన్యాగ్ని - రెండింటి సంయోగంవల్ల ప్రణవ నాదం పుడుతోంది. అది ఆహతమార్గంలో (expressed)

> నాభిహృత్కంఠ రసనక నాసాదులలో
> శోభిల్లు సప్తస్వరములుగా (త్యాగయ్య)

ఈ స్వరాలనుంచే భిన్న సంయోగ క్రమంలో అనంతరాగ ప్రపంచ
ఏర్పడుతుంది. ఆ ప్రణవనాదమే అనాహతమార్గంలో (unexpresse
షట్చక్రముల భేదనంచేసి యోగికి చంద్ర దర్శనం చేయిస్తోంది.

అందుకే భారతీయ గాయకులు ముక్తిమార్గంగా సంగీత సాధన
భావించారు తప్ప జీవికగానూకాదు, కళగానూకాదు.

మోక్షముగలదా భువిలో జీవన్ముక్తులు కానివారలకు
సాక్షాత్కార నీ సద్భక్తి సంగీత జ్ఞాన విహీనులకు
(త్యాగయ్య)

సంగీతం ఒక "స్వరార్ణవం" నారదమహర్షి స్వయంగా
గ్రంథాన్ని త్యాగయ్యకు అందించాడట *స్వరార్ణవంలో ఈనాదరహస్య
చెప్పబడింది.

ఆత్మమధ్యగతో ప్రాణః ప్రాణమధ్యగతోధ్వనిః
ధ్వనిమధ్యగతో నాదః నాదమధ్యగతః శివః

ఇలాంటి నాదమూర్తి కాబట్టి శివుడి "సప్తస్వరమూర్తి"ని శిల
రూపంలో కూడా చెక్కి భారతీయులు అర్చించారు. (చూ. N. S. కృ
మూర్తిగారి "సప్తస్వర" అనే ఆంగ్లగ్రంథం)

"శోభిల్లు సప్తస్వర సుందరుల భజించవే మనసా" అన
త్యాగయ్యగారు "శివశివ యనరాదా!" మనసా ! భవభయ బాధ
నణచుకోరాదా! అని అంతర్ముఖంగా నాదోపాసనచేసి తరించారు.

అందుకే త్యాగరాజస్వామి తనజీవితకాలంలో శ్రీరామనామాని
96 కోట్ల మార్లు జపించటానికి సంప్రదాయ వేత్తలు చెబుతారు అదిఎ
సాధ్యమంటే ఉచ్ఛ్వాసనిశ్వాసాలతో రామనామాన్ని నాదమయంగ
జపించటం వల్లనే సాధ్యమని మాతంగ్రిగారు కీ. శే. సుబ్బన్నశా
భాగవతులవారి వివరణ.

---

* చూ. ములుకుట్ల బ్రహ్మానందశాస్త్రి "త్యాగరాజు రామదర్శనము
(పు. 30)

నాద సుధారసంబిలను కరాకృతాయ మనసా ॥నాద॥
వేదపురాణాగమ శాస్త్రాదులకాధారమౌ ॥నాద॥
స్వరములారొక ఘంటలు-వరరాగము కోదండము
దురనయ దేశ్యము త్రిగుణము-నిరతగతి శరము రా
సరస సంగతి సందర్భముగల శిరములురా
ధరభజనే భాగ్యమురా త్యాగరాజు సేవించు ॥నాద॥

(నాద సుధారసము (సంగీతము) గరాకృతి (రామాకృతి) చెందినది. రాముని కోదండము రాగమయినది. సప్తస్వరములు కోదండమున కున్న ఏడు గంటలయినవి. రాముని త్రిగుణములు లేదా కోదండమునకున్న మూడు త్రాళ్ళు తుర, నయ, దేశ్యమార్గ సంగీత త్రయమైనది. కోదండమునుండి వెలువడు శరములు (బాణములు) రాగముయొక్క నిరతగమనముగా రూపొందినవి — అని కీ. శే. ములుకుట్ల సదాశివశాస్త్రి భాగవతులవారి వివరణము. చూ. బ్రహ్మానందశాస్త్రి పు. 128)

ఇలాంటిది నాదయోగం. సప్తస్వరరూపమైన ప్రణవోపాసన ఎలాంటిదో కింది శ్లోకాలు వివరిస్తున్నవి.

*సమ్మోహాత్ రిక్త విజ్ఞానః గంతామదవశః పతేత్*
*ధర్మచ్యుతోథ నిరయీ సంసారాబ్ధౌ నిమజ్జతి*
*(నారదపరివ్రాజకోపనిషత్తు)*

స = సమ్మోహితాత్మా; రి = రిక్తాత్మా; గ = గన్తా; మ = మదనమోహితః; ప = పతితః; ధ = ధర్మదూరః; ని = నిరయి — ఇలా బ్రహ్మస్వరూపుడైన జీవుడు సంసారబంధంలో చిక్కుకుంటాడు.

ఈశ్వరానుగ్రహముంటే ఇవే సప్తస్వరాలు ఎలా ముక్తి సోపానాలవుతాయో క్రింది శ్లోకంలో చూడండి.

*సత్త్వమప్యాష్య నిర్విణ్ణః ధర్మాత్మా పరతత్పరః*
*మహాత్యేనాత్ గతేర్దూరః రిక్తమాయః సదాప్తవాగ్*
*(అంవే. మోక్షమార్గము)* *

* పై ఉపనిషత్తును ఆధారంగా డా॥ బ్రహ్మానందశాస్త్రిగారు చేసిన చర్చకు చూ. త్యాగరాజు : రామదర్శనము పు 121)

స=సత్యాన్వేషి; ని=నిర్విణ్ణాత్మా; ధ=ధర్మాత్మ; ప=పరమాత్మ
మ=మహాత్మ సేత్; గ=గచ్ఛసై్మ; రి=రిక్తావిద్యః; స=స
భజేత్—ఇలా జీవ బ్రహ్మైక రూపమైన అద్వైత ముక్తిని పొంద
ఇది మరలా కుండలినీ యోగమే. సహస్రారం షడ్జస్థానం. అది ఆ
రూపంలో క్రింది షడ్జం (సమ్మోహం); తిరోభావరూపంలో పై
సత్యాన్వేషి) —ఇలాగే తక్కిన ఆరుస్వరాలలో షట్కమల సమన
చూసుకోవచ్చు.

త్యాగయ్య సాగించిన ఈనాదోపాసన అద్వైత, ద్వైత,
ద్వైతాలకు అతీతమైంది. ఛాందోగ్యోపనిషత్తులో "ఉద్గీథ విద్య
ఒకటి ప్రస్తావించబడింది. ఉపాసకుడు తనలో నాద స్వరూపంల
అచింత్యమైన శక్తిని నాదోపాసనద్వారా ప్రజ్వలింపచేస్తాడు. ఇ
పాసనకాగా: సాహిత్యశబ్దవేత్తలు శబ్దబ్రహ్మోపాసన చేస్తారు: (
యాన్ని గ్రంథమంతటా మునుపు వివరించాను)

నాథ సంప్రదాయవేత్తలు, తమిళ శైవ సిద్ధులు, ఆళ్వా
మహారాష్ట్రకు చెందిన 'వార్కరీ" సాంప్రదాయికులు నాదోపాసకు
భక్తులందరూ అనాహతనాద సాధన చేసినవారే. అనాహతనాద
మైన ప్రణవసాధనను "అజపాగాయత్రి' అని పిలుస్తారు. తిరు
లోని ఈశ్వరుడు-దక్షిణామూర్తి అజపాగాయత్రీ సాధకులకు అధిదై
ఆస్వామికి "త్యాగరాజు" అని పేరు. అందుకే రామబ్రహ్మంగార
కుమారునికి త్యాగరాజని నామకరణం చేశాడని సంప్రదాయ
చెబుతారు. *

అన్నమయ్య, రామదాసు, క్షేత్రయ్య ప్రభృతులైన ప
కర్తలందరూ ఈ నాదోపాసనచేత తరించినవారే.

* చూ. డా. జి. పద్మావతి "త్యాగయ్య కృతులు : భక్తి కవిత
లనము" అముద్రిత పరిశోధన గ్రంథం (1993) పు. 103-104.

న నాదేన వినా గీతమ్, న నాదేన వినా స్వరాః
న నాదేన వినా నృత్తం, తస్మాన్నాదాత్మకం జగత్॥
యదుక్తం బ్రహ్మణ స్థానం, బ్రహ్మగ్రంథిశ్చ యః స్మృతః
తన్మధ్యే సంస్థితాః ప్రాణాః ప్రాణాత్ వహ్ని సముద్గతః
వహ్ని మారుత సంయోగాత్ నాదస్సముపజాయతే
నాదాదుత్పాద్యతే బిందుర్నాదాత్ సర్వంచ వాఙ్మయమ్

(స్వామి ప్రజ్ఞానంద 'The Historical Evolution of the Philosophical concept of Indian Music' లో ఉదాహృతం)

నాదోపాసనచేత త్రిమూర్తుల నిర్గుణ సగుణ స్వరూపాలను రెంటినీ సాధించవచ్చు. పరబ్రహ్మ దర్శనాన్ని పొందవచ్చు స. గీత రత్నాకరం ఇలా చెబుతోంది.

నాదోపాసనయా దేవా బ్రహ్మ విష్ణు మహేశ్వరాః
భవన్త్యుపాసితా నూనం యస్మాదేతే తదాత్మకాః

త్యాగరాజుకూడా "శివుడవో కేశవుడవో కమలభవుడవో" — ఎవరనినిన్ను అర్చించేదిరా! అని, సగుణ "నామ" యోగసాధనచేసినవాడే. వీరందరి కన్నా ముందుగా శ్రీనివాసునిలో త్రిమూర్తి తత్త్వాన్నే కాకుండా సకల దేవతా స్వరూపాన్ని దర్శించిన పదకవితా పితామహుని "పద" గానంతో ఈ అంశాన్ని ముగిస్తాను.

(బేశిరాగం)

"ఎంతమాత్రమున నెవ్వరు దలంచిన నంతమాత్రమే నీవు
అంతరాంతరము లెంచి చూడఁ బిండంతే నిప్పటి యన్నట్లు॥ఎం
"కొలుతురు మిము వైష్ణవులు కూరిమితో విష్ణుండని
పలుకుదురు మిము వేదాంతులు పరబ్రహ్మమనుచు

తలఁతురు మిము శైవులు తగిన భక్తులను శివుఁడనుచు
అలరి పొగడుదురు కాపాలికులు ఆది భైరవుఁడనుచు ॥ఎం॥
"సరిసెన్నుదురు శాక్తేయులు శక్తిరూపు నీవనుచు
దరిసెనముల మిము నానావిధులను తలఁపుల కొలఁదుల
భజి
సిరుల మిమ్ము నే యల్పబుద్ధిఁ దలఁచిన వారికి నల్పంబవ
గరిమల మిమునే ఘనమని తలఁచిన ఘనబుద్ధులకు ఘనుఁ
"నీవలనఁ గొఱతలేదు మఱి నీరుకొలఁది తామరవు
అవల భాగీరథి దరిబావుల ఆ జలమే ఊరిన యట్లు
శ్రీవేంకటపతి నీవైతే మముఁ జేకొనియున్న దైవమని
యీవల నే శరణని యెద నిదియే పరతత్త్వము నాకు
(అధ్యాత్మ సంకీర్తనలు 179



# శబ్ద యోగ భూమిక

ఆచార్య హెచ్. ఎస్. బ్రహ్మానంద

ద్వే బ్రహ్మణీ వేదితవ్యే
శబ్దబ్రహ్మ పరంచయత్
శబ్దబ్రహ్మణి నిష్ణాతః
పరంబ్రహ్మాధి గచ్ఛతి

(మైత్రేయాణీ ఉపనిషత్తు)

[There are two Brahmans to be known : the Sabda and the Para. One who masters the Sabda shall attain the Para - the highest order of Nirvana.]

ముద్రణ : వెరైటీ ప్రింటర్సు
వల్లబజారు, ఏలూరు, ప.గో॥జిల్లా.